# జానపదం




భాషా సాంస్కృతిక శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం





# జానపదం

## ఆంధ్రప్రదేశ్

## భాషా సాంస్కృతిక శాఖ




ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
భాషా సాంస్కృతిక శాఖ



ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
## గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడు గారు

రాష్ట్ర ప్రజలకు ముందుగా 'శ్రీదుర్ముఖినామ సంవత్సర' ఉగాది శుభాకాంక్షలు.

జానపద కళ అత్యుత్తమమైనది. సంపూర్ణమైనది. సంగీత సాహిత్య సమ్మేళనంతో మానవ హృదయాలను వ్యక్తీకరించే సంపూర్ణమైన కళాంశం జానపదం. మోక్షసాధనకు దగ్గరమార్గం జానపదమని అతిరథ మహారథులు కొనియాడిన మహోన్నత అంశం. ఇటువంటి కళ ఏ కొద్ది మందికో పరిమితం కాకూడదు అందరూ దీనిని ఆదరించాలి. ఆంధ్ర, రాయలసీమ ప్రాంత ప్రజలు ఆయా ప్రాంతాల భాషను అనుసరించి ఒక్కొక్క పేరుతో ఒక్కొక్క కళారూపాన్ని రూపుదిద్దారు. ఇవి గ్రామ సంబంధమైన పదాలు కాబట్టి ఆయా ప్రాంతవాసులు మాట్లాడుకునే భాష నుండి పుట్టి వారి నాలుకలపై నానుతుంటాయి అనేది జగమెరిగిన సత్యం. ఈ జానపద కళలు మానవ జీవన గమనంలో ఒక భాగమై విరాజిల్లుతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని జానపదకళలు భారతదేశ సంస్కృతికి మాతృకలు. వీటిని కాపాడుకోవలసిన బాధ్యత ప్రజలందరిపైనా ఉన్నది. ఆంధ్రులు కొన్ని యుగాలుగా శ్రమపడి సంరక్షించుకొన్న అమూల్య జానపద విలువలను పాశ్చాత్య నాగరికత అనే ప్రభంజనం మొత్తం రూపుమాపేయగల ప్రమాదం లేకపోలేదు.

కాబట్టి ఎన్ని విపత్తులనుండైనా మనకు మనం రక్షించుకోగలమన్న ఆత్మస్థైర్యం ఉన్న మనం మన సంస్కృతి - సంప్రదాయాలకు ఆలవాలమైన జానపదాన్ని రక్షించుకోవాలి, వీటిని భావితరాలకు అందివ్వాలి.

మన గ్రామాల్లోని ప్రజలు తమకు తాముగా అభివృద్ధి చెందటానికి నైతికపరమైన, వైజ్ఞానిక పరమైన విద్యను విస్తరింపజేయుట మన కర్తవ్యంగా భావించాలి. అందుకు జానపద కళలను ఆధారంగా తీసుకోవాలి. విద్య విజ్ఞానాలు సామాన్య ప్రజల్లో ఎంత ఎక్కువగా విస్తరిస్తే మన అభ్యున్నతి అంత సాధించినట్లు. మన విజ్ఞానపు వికాసానికి జానపదం ముందు వరుసలో ఉంటుంది. అట్టి జనపదంలోని జానపదాన్ని మనందరం కలసి ముందుకు తీసుకువెళ్దాం.

భారతదేశ బౌద్ధ శిల్పకళలో అమరావతి శిల్పకళ అత్యద్భుతమైన శిల్పకళ. అట్టి అమరావతి చైత్య నిర్మాణ సంప్రదాయానికి మన తెలుగు నేల తొలినుండి ముందే ఉంది. అమరావతి శిల్ప సౌందర్యాలలో మన జానపద కళల సందడి కనిపిస్తూనే ఉంది. నేటి మన 'అమరావతి' నుండి కూడా ఈ జానపద కళల అభివృద్ధి, వాటికి ప్రోత్సాహం తప్పక లభిస్తుంది అని తెలియజేస్తూ.... మన జానపద కళల అభివృద్ధిని కాంక్షిస్తున్న వారికి మనఃపూర్వక అభినందనలు అందజేస్తున్నాను.

**శుభాకాంక్షలతో...**

**మీ**

ఎన్. చంద్రబాబునాయుడు






ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
భాషా సాంస్కృతిక శాఖ

**గౌ॥శ్రీ పల్లె రఘునాథరెడ్డి గారు**
సమాచార, పర్యాటక, భాషా సాంస్కృతిక శాఖామాత్యులు

# సందేశం

కళ అనేది ఇటు కళాకారునికి ఆనందాన్ని, అటు ప్రేక్షకులకు రసస్ఫూర్తిని కలిగించాలన్నది నానుడి. జానపదం ప్రజలందరి మన్ననలు అందుకుంటున్నది అన్నది అతిశయోక్తి కాదు. వాడుక భాష ప్రజల నాల్కలో ఉంటుంది కాబట్టి అది ప్రజల హృదయాంతరంగాల్లోకి వెళ్తుంది.

జానపదం పల్లెలనుంచి ఉద్భవించింది. పల్లె ప్రజల గుండె చప్పళ్లే జానపదం. మన కళలను మనం పరిరక్షించుకుందాం. పల్లెలు కనుమరుగవు తున్నాయి అని అనుకుంటున్నవారు పల్లె సంస్కృతి మాత్రం ప్రజల గుండెల్లో ఉంటుందన్న నిజం తెలుసుకోవాలి.

మన సంస్కృతి, సంప్రదాయాలను కాపాడుకొని వాటిని ప్రపంచ దేశాలకు అందజేయాలన్నదే మన ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారి ఆలోచన.

'పనికి తోడు పాట, ఆ పాటకు సరిజోడు పని' పనిపాటలిద్దరూ "కవల పిల్లలు" అన్నట్టుగా జానపదులు తమ శ్రమను మరచిపోవడానికి పాడుకునే ఉడుపులు పాట, దంపుడు పాట, ఉయ్యాల పాట ఇలా ఎన్నో... ఎన్నెన్నో.. కానీ నేడు అదే పల్లె ప్రజలు "చంద్రుడు - మన చంద్రన్న" చేసే

విజయాలను చూడండి... "24 వేల కోట్ల రుణమాఫీ చేసెనండి"... అని తమ కష్టం మరచిపోవడానికి పాడుకుంటున్నారు. దీనిని బట్టి మన ముఖ్యమంత్రి గారి సారథ్యంలో పల్లె ప్రజలు, పల్లె సంపద ఎంత అభివృద్ధి చెందుతుందో మనం ఆలోచించవచ్చు.

జానపద కళ ఉత్తమోన్నతమైనది. నేటి శాస్త్రీయ కళలకు పునాది జానపదం. మన జానపదాన్ని ఖండ ఖండాంతరాలకు వ్యాపింపజేస్తూ......... ఈ కళ అభ్యున్నతికి ప్రభుత్వం కట్టుబడి ఉంది. ఇందుకు ప్రజలందరూ సహకరించగలరని మనస్ఫూర్తిగా కాంక్షిస్తూ....

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలతో.......

మీ

పల్లె రఘునాథరెడ్డి

# స్ఫూర్తిదాయకం



**శ్రీ నీరబ్‌కుమార్ ప్రసాద్,** ఐ.ఏ.ఎస్.,
**ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి**
**యువజనాభ్యుదయం మరియు పర్యాటక శాఖ**

జానపదులు పాడేపాటల్లో, ఆడే ఆటల్లో మానవ హృదయ సంవేదన ఉంటుంది. వేదం పుట్టినా, పురాణం వచ్చినా, కావ్యాలు వెలసినా జానపదుడి భావోద్వేగాల్లోనే వాటి పునాది ఉంది. అందుకే జానపదం ఎవరికైనా అతి ముఖ్యమైన కళగా భావించాలి.

జానపద కళల్ని సంరక్షించడంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకుంటుంది. ఈ రాష్ట్రంలోని పదమూడు జిల్లాల్లో సుమారు ఎనభై జానపద కళారూపాలున్నాయంటే ఎంతో ఆశ్చర్యం వేస్తుంది. శ్రీకాకుళం నుండి చిత్తూరు వరకు ఆయా జిల్లాల జానపద సాంస్కృతిక సంపదకు గీటురాళ్ళుగా తప్పెడగుళ్ళు, కత్తిసాము, కర్రసాము, చెక్కభజన, గరగలు, వీర నాట్యం, తోలు బొమ్మలాట, మరగళ్ల ఇలా ఒకటేమిటి వివిధ రకాల కళారూపాల వైవిధ్యం ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వైభవాన్ని చాటుచెపు తున్నాయి.

గత సంవత్సరం జరిగిన గోదావరి మహాపుష్కరాల్లో మొదటి రోజున 1000 మంది కళాకారులతో పెద్ద ఊరేగింపు నిర్వహించాం. ప్రభుత్వం తరుపున ఏర్పాటు చేసే ఏ కార్యక్రమంలోనైనా జానపద కళలకు చోటు కల్పిస్తున్నాం. ఇటు శాస్త్రీయ, అటు జానపద కళారూపాల విశిష్టతతో అలరారే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కళలకు పెద్దపీట వేయడం జరుగుతుంది.

ఈ దిశగా రాష్ట్ర భాషా సాంస్కృతిక శాఖవారు ముద్రించిన 'జానపదం' రాష్ట్రంలోని కళారూపాలపై చక్కని వివరణాత్మకమైన గ్రంథం.

భాషా సాంస్కృతిక శాఖకు అభినందనలు.

**నీరబ్‌కుమార్ ప్రసాద్,** ఐ.ఏ.ఎస్.
ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి



**డా॥ డి. విజయభాస్కర్**
సంచాలకులు
భాషా సాంస్కృతిక శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

# ముందుమాట

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కళలకు పుట్టినిల్లు. అనేకమయిన కళలు ఆవిర్భవించి, ప్రజాదరణ పొంది, స్వరాష్ట్రంలోనేకాక ఇతర రాష్ట్రాలు మరియు ఇతర దేశాలలో కూడా ఖ్యాతి నార్జిస్తున్నాయి.

ఈ కళలను పూర్వము జాతరలలో, దేవాలయ ఉత్సవాలలో మరియు ఇతర సామాజిక కార్యక్రమాలలో ప్రదర్శించబడి అందరి మన్ననలు పొందుటయేకాక కళాకారులు ఆర్థికముగా నిలబడుటకు వీలు కల్పించబడుతుంది. కాలక్రమేణ పట్టణ సంస్కృతి విస్తరించుటవల్ల ఈకళల ప్రదర్శన పరిధితగ్గి గ్రామాలకు పరిమితమయినవి.

ఈ కళాకారులందరినీ ఒక త్రాటిమీదకు తీసుకొని రావలయు ననే సంకల్పంతో ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖవారు గత రెండు సంవత్సరములుగా అనేక కార్యక్రమాలు నిర్వహిస్తూ అందులో భాగంగా కొన్ని కళారూపాలను రాష్ట్రంలోని అన్ని జిల్లాల యంత్రాంగ సహకా రముతో నిర్వహించుట జరుగుచున్నది. అందువల్ల ప్రజలకు కళా రూపాలపట్ల అవగాహన, సహృద్భావము ఏర్పడి మరియు పేద కళాకారులకు ఆర్థికముగా చేయూత ఇచ్చుటయే కాక వృద్ధ కళాకారు లకు ప్రతి నెలా పెన్షన్ ఇవ్వటం జరుగుచున్నది.

జానపద కళారూపాలకు సంబంధించిన రచనకు సహాయ సహకారములందించిన శ్రీ మురళీబాబు, విశాఖపట్టణం వారికి హృదయ పూర్వక అభినందనలు.

ఈ జానపదం పుస్తకములోని విషయాలు సమగ్రమని మేము భావించుటలేదు. కళాకారులు చెప్పిన విషయాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి రచించబడినది. మీ అమూల్యమైన సలహాలు, సూచనలు తెలియ జేసినచో ఈగ్రంథ రచన యొక్క ప్రయోజనము నెరవేరగలదని భావిస్తున్నాను.

**డా॥ డి. విజయభాస్కర్,** ఎం.ఏ., పి.హెచ్.డి.,
సంచాలకులు





# జనపదం - జానపదం

జనపదములు అనగా గ్రామము లేదా పల్లెల్లో నివసించు ప్రజలు 'గ్రామీణులు' జనపదములోని జనపదమే జానపదమయింది. జానపదము అనగా దేశము, గ్రామము, గ్రామ సమూహమని నిఘంటువు సూచిస్తుంది.

ఆంధ్రుల చరిత్రకు ఎంత ప్రాచీనత ఉందో ఈ జానపద కళలకు కూడా అంతే చరిత్ర ఉంది. కాలక్రమంలో జానపద పాటలతో పాటు జానపద కళలు ఆవిర్భవించాయి.

పది పూరిళ్లు ఉన్న పల్లె మొదలుకొని పెద్ద పట్టణం వరకు వైష్ణవ ఆలయం గాని, శివాలయం గాని విధిగా ఉండటం ఆచారంగా వస్తుంది. అలాగే ఆ ఊరికి ఓ రచ్చబండ ఉండేది. ఆ ఊరి రాజకీయాలకు రచ్చబండ వేదిక అయితే ఆధ్యాత్మిక చింతనకు దేవాలయం వేదికగా ఉండేది. దేవాలయాన్ని పరిరక్షించడానికి ఓ వైజ్ఞికుడు వెలిసాడు. ఆయన దీపపు సేవ, విశ్రాంతి సేవ, నిద్రపుచ్చడం, కొలువు పుచ్చడం మొదలగు వాటిని రోజువారి కార్యక్రమాలుగా చేస్తూ వారు మాట్లాడే భాష మంత్రోచ్ఛారణ అన్నీ సంస్కృతంలో ఉండేవి. దీనిని దేవభాష, దేవలిపి అని పేరుపెట్టారు. భగవంతుని యొక్క లీలలను సామాన్య ప్రజానీకానికి తెలియజేయవల్సిన అవసరం ఎంతైనా వుందని భావించిన పెద్దలు ఇంటికి అందాన్ని, ఆనందాన్ని ఇచ్చేది"స్త్రీ" సర్వకళాశోభిత "స్త్రీ" అటువంటి స్త్రీ ఆడుతూ, పాడుతూ దేవుని లీలలను సామాన్య ప్రజానీకానికి తెలియజేయాలని సంకల్పించి జెక్కిణిని ప్రవేశపెట్టారు. కాలానుగుణంగా కొంతకాలానికి జక్కుడు తోడయ్యాడు. వీరు పాడే పాటలను ఆలకించిన స్త్రీలు. రాత్రి పూట తమ శ్రమను మరచిపోవడానికి ఆ పాటలను పాడుకుంటూ భగవంతుని స్మరించేవారు.

అయితే జానపద కళారూపాలంటే అవి శాస్త్రీయమైనవి కావని

అవి కేవలం పామరుల కళారూపాలని చాలామందిలో చిన్నచూపు ఉంది. కానీ సంగీతానికి, నృత్యానికి ఎలాంటి శాస్త్రీయత ఉందో అలాంటి శాస్త్రీయతే వీటికి ఉంది. ఈ కళారూపాలలో సంగీతం ఉంది, తాళం ఉంది, లయ ఉంది, ఆంధ్రుల సాంఘిక చరిత్ర 2 వేల సంవత్సరాల నాటిది. నాటి నుంచి నేటి వరకు ఆయా రాజుల కాలంలో రకరకాలుగా జానపద కళలు పోషించబడ్డాయి. ప్రజలు ఆదరించారు. సంస్కృతి సంపదకు, సంప్రదాయాలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భాషా సాంస్కృతిక శాఖ ఈ చిన్న పుస్తకంతో మీ ముందుకు వస్తుంది.

శతాబ్దాలుగా రాజులు పోయినా, రాజ్యాలు మారినా జానపద కళలు మాత్రం ప్రజల హృదయాల్లో నిలిచి ఎన్ని ఆటుపోట్లు వచ్చినా వాటిని ప్రజలు పోషించారు. కళలు, కళాకారులను కన్నబిడ్డలుగా చూసుకున్నారు. తెలుగుజాతి గర్వించదగ్గ కళారూపాలు ఇవి. పల్లెవాసుల గుండెల చప్పళ్ల నుండి ఉద్భవించినవే ఈ జానపద కళలు. ఆధునిక సంగీతానికి, సంగీత సాధనలకు జానపద సంగీతం, వాయిద్యాలే ఆధారమన్న సంగతి మరచిపోరాదు. అక్షరజ్ఞానంలేని ఈ కళారూపాలను ఒకప్పుడు ప్రజలు ఆదరించారు. ప్రజల ఆదరణలోనే అవి మనుగడ సాధించాయి, సాధిస్తున్నాయి.



వ్యవసాయమే ప్రధానవృత్తిగా గల గ్రామాల్లో ఆధునికత చోటు చేసుకొన్న రోజుల్లో ఈ జానపదాలు ఎంత ప్రభావాన్ని చూపాయో చెప్పనక్కరలేదు. కష్టజీవి స్వేదబిందువులే జానపద నృత్యానికి కేంద్ర బిందువు. పగలంతా కష్టపడి పనిచేసే రైతులకు, శ్రామికులకు రాత్రి పూట ఈ జానపదాలు ఉపశమనం. పనికితోడు పాట, పాటకు సరిజోడు పని, పనిపాటలు ఇద్దరు కవలపిల్లలు అని అనటం అతిశయోక్తి కాదు.

జానపద వాఙ్మయంలో అనేక పాయలున్నాయి. మరెన్నో కళారూపాలున్నాయి. నిజానికి ఇదొక ఇంద్రధనుస్సు వంటిది. ఏ రంగు తరువాత ఏ రంగు అంటే గీత గీచి చూపలేనట్లే దేనికదే గొప్పది. ఒక రంగు క్రమంగా అంతమవుతూ మరో రంగుగా మారుతుంది జానపద కళలన్నీయింతే. వీటిని కళలన్నా, విద్యలన్నా, సంస్కృతి నాగరికతలన్నా వేర్వేరు పేర్లేగాని మరొకటి కాదు.

అయితే వాటినన్నింటిని నిలుపుకొనే ఇంద్రచాపం కావాలా వద్దా అనేదే ప్రశ్న. ఇంద్ర ధనుస్సు లేని భవిష్యత్ ఎవరికి మాత్రం కావాలి. సంస్కృతి అంటేనే ఒక జాతి భావితరాలకు అందించే జీవన విధానపు వారసత్వపు సంపద. అందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భాషా సాంస్కృతిక శాఖ నడుం బిగించి మన సంస్కృతి సంపదను పదిమందికి పంచాలన్న దృఢ సంకల్పంతో ముందుకు వస్తుంది. ప్రతి సాంస్కృతిక సమాజాన్ని తట్టి లేపుతుంది. కళాకారులను ప్రోత్సహిస్తుంది. ప్రాచీన మౌఖిక సాహిత్యానికి వెలుగులోకి తెచ్చి అక్షరబద్ధత చేయాలని ఏ కళారూపమైన ప్రతిఒక్కరు తెలుసుకున్న విధంగా ముమ్ముందు జానపద కళలను పెంపొందించాలన్న ప్రయత్నం చేస్తుంది. ☼



# హరికథ

యక్షగానానికి ముఖ్యమైన పాత్ర 'సూత్రధారి' ఈ సూత్రధారి వేరువేరు పాత్రలను తానే కథ కదనంతో కలిపి నటిస్తే యక్షగానం ఈ యక్షగానమే హరికథ అయ్యింది. అంతే కాకుండా యక్షగానం హరికథ ఒకటే అని కూడ చెప్పవచ్చు. అందుకు కారణం పాల్కురికి సోమనాధుడు, శ్రీనాధుడు, జక్కుల పురంధ్రులు శివుని కథలు ఏకవ్యక్తి ప్రదర్శనలు ప్రదర్శించినట్లు చరిత్ర విదితం. యక్షగానంలో ఉండే దరువులు, కందార్థాలు, సంవాదాలు, పద్యాలు, ఇత్యాదులు హరికథలో కూడా ఉంటాయి. 'భక్త జనులారా! వినుడీ హరికథ' వినగ వేడుక గలిగేనని ప్రారంభమవుతుంది. దీనినే హరికథా కాలక్షేపం అంటారు. హరికథ చెప్పేవారిని హరికథ దాసులని, హరికథా భాగవతార్‌లని అంటారు.

తెలుగునాట ఉత్తరాంధ్ర జిల్లాలో మొట్టమొదటి హరికథ వాగ్గేయకారుని గురించి చెప్పాలంటే గోకులపాటి కూర్మనాథ కవి. గోకులపాటి విష్ణు భక్తుడు. ఈయన 'మృత్యుంజయ విలాసం పేరిట' యక్షగాన రచన చేసి దానిని హరికథగా ప్రాచుర్యం చేశారు. ఈయన విశాఖజిల్లా తిరుమల పెద్దింటి శిష్యుడు కూర్మనాథకవి సంగీత



విద్వాంసునిగా, భాషావిశారదునిగా పేరెన్నికగలవారు. మృత్యుంజయ విలాసంలోని పెండ్లి పాట నాటి కాలంలో ఇంటింట పాడుకునేవారు. ఈయన రచనలోని దరువులు, పద్యాదులు, లలితంగా ఉండే కవితా శిల్పం నాటి సాహితీపరుల్లో పేరు ప్రఖ్యాతులు పొందారు.

తరువాత హరికథ కళకు చిరునామాగా చెప్పాలంటే ఆదిభట్ల నారాయణదాసు ఒక్కరినే చెప్పాలి. ఐహిక సభలలో నిద్రావస్థలో ఉన్న భక్త జనాన్ని 'శ్రీమద్రమా రమణ గోవిందో హరి' అని మేల్కొలిపే వారు. ఆదిభట్ల నారాయణ దాసు గారు 1864 రక్తాక్షి నామ సంవత్సర శ్రావణ కృష్ణ చతుర్ధశినాడు జన్మించారు. ఈయనకు ముందుతరంలో ఎంతమంది ఉన్నా 'హరికథ పితామహుడు' అనే పేరు ఆదిభట్ల నారాయణదాసుకు మాత్రమే ఉంది. ఈయన అసలు పేరు సూర్యనారాయణ. హరికథ చెప్పడంలో ప్రతిభా సంపద్విశేషమూర్తియైన తరువాత నారాయణదాసు అయ్యారు. సుమారు 80 సంవత్సరాలు జీవించిన నారాయణదాసు గారు విజయనగరం విజయరామ గజపతి సంగీత కళాశాల ప్రధానాచార్యులుగా కూడా కొలువుచేశారు. హరిదాస వంశములో అంతటి విద్వన్మనోహరులు లేరని చెప్పవచ్చు. నిద్రావస్థలో ఉన్న ప్రజలను మేల్కొలిపి ఆధ్యాత్మిక ప్రపంచంవైపు నడిపించిన హరికథా పితామహులు వీరు.

# తూర్పుభాగవతం

భారతాన్ని సమాజానికి అందించిన వ్యాసులవారికి ఏదో అసంతృప్తి పట్టిపీడిస్తుండేదట. అప్పడు భగవంతుని కథలు, లీలలు భాగవతంరూపంలో వ్యాసులవారు అందించారు. దానికి తెలుగులో పోతనామాత్యుడు భక్తి పారవశ్యంతో ఆంధ్రీకరించెను. అప్పటి నుండి తెలుగునాట భాగవతం లేని ఇల్లు లేదంటె ఆశ్చర్యమే.

కావ్యేషు నాటకం 'రమ్యం' అని భావించినట్లే జానపదకళల్లో వీధి భాగవతం రమ్యమైనదిగా కవులు, కళాకారులు భావిస్తున్నారు. తూర్పు తీర ప్రాంతంలో నేటికీ సజీవంగా ఉన్న జానపద కళ తూర్పు భాగవతం.

తూర్పుతీర ప్రాంతంలో నేటికి అమ్మవార్ల జాతరలో తొలిరోజున ఈ కళారూపాన్ని ప్రదర్శించటం ఆనవాయితీగా వస్తుంది. ఉత్తరాంధ్ర ప్రాంత వాసులను తూర్పువారని అంటారు. ఇక్కడ మాండలీకాలు, బాణీలు, యాసతో ఏర్పడినదే తూర్పుభాగవతం. దీనిలో రాగాలు బరువుగా ఉండుటచే నాటు భాగవతమని కూడా అంటారు.

పెద్ద రాగాలతోకూడిన కథాగానం. స్త్రీపాత్రగా పాడిన పాత్రదారునికి చాలాపెద్ద గాత్రం ఉండాలి. లేకపోతే ఈ కళారంగంలో రాణించలేరు. ఒక్కొక్కరాగాన్ని గంటలతరబడి గంతులు వేస్తూ హెచ్చుశృతిలో దీర్ఘకాలం ఆలాపన చేస్తారు.

ఈ భాగవత ప్రదర్శనలో పద్య, గద్య, దరువు, ద్విపదలతో వ్రాసారు. కూచిపూడిని సిద్ధేంద్రులు రచించారు. కూచిపూడిని ఒకరు పాడితే ఇంకొకరు అభినయించాలి. భామాకలాపమను ఈ తూర్పు భాగవతం తాళం, రాగం, అభినయించడం ముఖ్యపాత్రదారిది. హాస్యనవరసపాత్రలు సూత్రదారులవి. అందరు మెప్పగా వాయించటం వాయిద్యగానిది (మృదంగి) తెల్లవార్లు వంత పాడడం, తాళం కొట్టడం హంగుదారులది. పడమట ప్రాంతంలో కూచిపూడి మాత్రమే ప్రాధాన్యత సంతరించుకొన్నది. కీ.శే. కాలుగుంటి వెంకన్న గారి నుండి తూర్పు భాగవతం ప్రాచుర్యాన్ని సంతరించుకుంది.

# జముకుల కథ

ఇది ఉత్తరాంధ్రకు చెందిన అతిప్రాచీనమైన జానపద కళారూపం. జముకుల కథకులు అనాదిగా ఈ ప్రాంతంలో ప్రసిద్ధిచెందారు. ఇది బుడబుడక్క మని మ్రోగే మనోహరమైన వాయిద్యం. శ్రీకాకుళం జిల్లా సోంపేట, పలాస, మందస మండలాల్లో దీనిని "బోనెలపాట", "బుడబుక్కల పాట" అనికూడా అంటారు. ఈ జముకుల కథలో వీర, కరుణ, శృంగార రసాలు ప్రధానపాత్ర వహిస్తాయి. ఈ కళారూపాన్ని స్వీకరించిన అనేకమంది కళాకారులుగా జీవనం సాగిస్తున్నారు. దీనిని వృత్తిగా భావించిన వారు జముకుల కథను పవిత్రంగా భావిస్తారు. ఈ కళారూపంలో జముక వాయిద్యం గూర్చి కళాకారులు ఒకకథ చెపుతారు.

సుకేతుడు అనే రాక్షసుని సంహారం అనంతరం ఎల్లమ్మదేవి ఆరాక్షసుడి వెన్నుమీద చర్మాన్నివలిపించి ఒక డబ్బాను మూతగా అమరింప జేసిందని, వెన్నునరం ఏకనరంగా తాడును తయారు చేయించిందని, కాలిమూలుగు దుమ్ము బిళ్ళగా తయారు చేయించిందని, ఇలా తయారయ్యిందే జముకని పురాణగాధ. అంతేగాదు జానపదుల్లో ఈ జముకుల కథకు సంబం ధించి మరో నమ్మకం కూడా ఉంది. ఈ జముకుధ్వని వినిపించినంత మేరా గాలి, దెయ్యం, పిశాచం లాంటివి ఏవీరావని వాటి ప్రభావం పడదని నమ్ముతుంటారు.

**జముకు** కుంచం ఆకారంలో ఉన్న ఒక డొక్కుకి ఒక ప్రక్క కప్ప చర్మంతో మూస్తారు. ఆచర్మానికి మధ్య చిన్న రంధ్రంచేసి ఒక నరాన్ని దారం చివరి ముడివేసి అందులోకి దూర్చి ఆ నరానికి చిన్న కర్ర ముక్కకడతారు. ఆకర్రకు చివర మువ్వలు కడతారు. కర్రతో దారాన్ని బిగుతుగా లాగి వదులుతుంటే ఒక రకమైన ధ్వని వస్తుంది.

ఈ కళాకారులు ఉపయోగించే సాధనం జముకు. అందుకే దీని

పేరు జముకుల కథ. దీనినే శ్రీకాకుళం జిల్లాలో కొన్ని ప్రాంతాలలో బోనెల కుండ అని కూడా అంటారు. దీనిని కర్ర, రేకు, కంచు, ఇత్తడితో కూడా తయారు చేస్తారు.

కవి, గాయకుడు, పోరాటయోధుడు అయిన శ్రీ సుబ్బారావు పాణిగ్రాహి గారు ఒకచేతితో జముకు, మరో చేతితో గన్ పట్టి ప్రజలకు జముకుల పాట ద్వారా దగ్గరైనారు. నిజంగా సుబ్బారావు పాణిగ్రాహి గారు జముకుల కథ పాట చాలా సులభతరమై ప్రజలను ఆలోచింపజేసింది. ఉద్దానం ప్రాంతంలో ఈ పాటలు ఇప్పటికీ చిరస్థాయిగా ఉన్నాయి. ☼



# బుర్రకథ

శ్రీనాథ కవి సార్వభౌముడు క్రీడాభిరామం గ్రంథంలో "డక్క హుడక్క జజ్జరల్ జల్లరి యాది కాగల శబ్ద తాళ పరంపర తంబుర మీటుచు నాడుదురే నగ్రవేదికపై" అని వ్రాసినట్లుగా ఈ బుర్రకథ కొనసాగుతుంది అని అనటం అతిశయోక్తి కాదు. బుర్రకథ అనగా బుర్రల సహాయంతో చెప్పబడేది కావడం వలన అది బుర్రకథ అయింది. ప్రధాన కథకుడు వాడేది తంబూర, తంత్రి, బుర్ర తంబుర, తంబుర. వంత లిరువురు వాడే గుమ్మెటలను కూడా కొన్ని ప్రాంతాలలో బుర్రలు అంటారు బుర్రకాయ, డిక్కీ అని అంటారు. వీధి భాగవతం, యక్షగానాలు బుర్రకథకు జన్మస్థానాలని కొందరంటుండగా, శారదాకాండ్ర కథలు ఆధారంగా, జంగం కథలు ఆధారంగా బుర్రకథలు పుట్టాయని మరికొందరి అభిప్రాయం. శారదా కథలలోను, జంగం కథలలోనూ తంబుర, డిక్కీలు ఉంటాయి. శారదా కాండ్రు ధరించిన తంబురకే శారదా (శారదా అనగా సరస్వతి) అని పేరు. అలాగే జంగాలు దానిని "సితార" అని దాసర్లు "తామర" అని అంటారు. ఏమైనప్పటికీ ఆధునిక కాలంలో బుర్రకథలు ఆంధ్రప్రదేశ్‌ని కొన్ని దశాబ్దాల పాటు ఉర్రూతలూగించింది. మధ్యవ్యక్తి పాటపాడగా, వంతలుగా వుండేవారిలో ఒక ఆయన వచనం చెబుతూ రాజకీయం చెప్పగా మరొకాయన హాస్యం చెబుతూ సందర్భోచితంగా ప్రేక్షకులను మెప్పిస్తూ సామాన్య జన జీవన స్రవంతిని ప్రతిబింబిస్తాడు. ఈ కథల్లో ప్రభోధాత్మకాలు, చారిత్రకాలు, పౌరాణికాలు, సాంఘికమని నాలుగు రకాలు. తెలుగులో జంగం కథలను అనుకరిస్తూ బుర్రకథను సృష్టించిన కీర్తి సామ్యవాదులదే. వీరు ఉద్యమ స్ఫూర్తితో బుర్రకథను సృష్టించారు. 1942 ప్రాంతంలో గుంటూరు జిల్లా బాపట్ల ప్రాంతంలోని కాకుమని సుబ్బారావు గారు జంగం కథలను బొబ్బిలి

వరుస కథలుగా అనుకరిస్తూ బుర్రకథ రచించారు. బహుశ ఇదే మొదటి బుర్రకథ కావచ్చు. ఆయనే స్వయంగా గానం చేసేవారు. ఈ కళాకారులకు ఒక రూపకల్పన కల్పించి ఆధునిక బుర్రకథలకు ఆద్యుడు బుర్రకథ పితామహుడు స్వర్గీయ షేక్ నాజర్ గారు అయితే రామచంద్రపురం జూనియర్ నాజర్ ఆంధ్రదేశమంతటా ఈ కళకు వన్నెతెచ్చారు. ఖండాంతరాలలో తెలుగువారి కీర్తి బుర్రకథ ప్రతిష్టను నలుదిశలా వ్యాపింపజేసి టాన్యాకథ చెప్పినా కష్టజీవి కథ చెప్పినా, కరువు కథ చెప్పినా శ్రోతలు వీరితో కలిసి ఆడాల్సిందే. తరువాతి తరంలో అమలాపురంకు చెందిన షేక్ మహమ్మద్ హుస్సేన్ (బాబ్జి) బృందం ఫ్రాన్స్‌దేశంలో 50 ఎకరాల స్థలంలో "బొబ్బిలియుద్ధం" కథను ఆలపించగా వీరి కథాగమనాన్ని వ్రాయించి బుస్సీదొర గారి ఇంట్లో పెట్టారు. వీరు ప్రదర్శించిన 50 ఎకరాల స్థలమును భారతదేశం నుండి అందులో ఆంధ్రప్రదేశ్ నుంచి వచ్చిన కళాకారులు గనుక ఆ ప్రదేశాన్ని భారత్‌ప్రదేశ్ అని నామకరణం చేశారు.



# తప్పెటగుళ్లు

ఉత్తరాంధ్రాలోని శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలలోని పేరెన్నికగన్న జానపద నృత్యాలలో ఓ ప్రత్యేకతను సంతరించుకున్న నాట్యకళ తప్పెటగుళ్లు. ఒకప్పుడు గుండెచప్పళ్లుగా పేరుగాంచిన ఈ కళ కాలక్రమేణా తప్పెటగుళ్లుగా రూపాంతరం చెందింది. ఇది ఒకప్పుడు కేవలం యాదవ కులస్తులలోనే ఉండేది. వీరు వలసజీవులు. తమ మేకలు, గొర్రెల మందలతో ఒక ప్రాంతం నుంచి వేరొక ప్రాంతానికి వలస పోయేవారు. రాత్రిపూట క్ర్యూరమృగాల నుండి తమ మందలను కాపాడుకోవటానికి ఏదో ఒకటి చేయాలన్న ప్రయత్నంతో ఆవిర్భవించింది ఈ కళ. విరిగిన మట్టి కుండలకు చనిపోయిన తమ జంతువుల చర్మాన్ని కట్టి పెద్దగా వాయిస్తూ శబ్దం చేస్తూ క్రూరమృగాలను తరిమేవారు. ఆ శబ్దం కూడా సరిపోక మువ్వలను కట్టుకొని గెంతుతూ పెద్ద పెద్ద శబ్దాలు చేసేవారు. అప్పట్లో కొంతమంది పెద్దలు తలచుకొని రాబోయేకాలంలో మట్టికుండలు కాని, చర్మం గాని దొరకదని ఆలోచించి రేకుతో చేసినటువంటి ఓ గుండును తమ గుండెలపై కట్టుకొని రంగు రంగుల జుబ్బాలను ధరించి నిక్కరు వేసుకొని నిక్కరుపై పెద్దసైజు గల మువ్వలను కట్టుకొని కాళ్లకు సిరిమువ్వలను కట్టి ప్రస్తుతం ప్రదర్శన చేస్తున్నారు. బొబ్బిలిరాజుల సంస్థానంలో ఆస్థాన విద్వాంసుడుగా ఉన్నటువంటి వ్యక్తి యొక్క మునిమనమడు దేవర రాములు. ప్రస్తుతం 80 సంవత్సరాల వయస్సులో కూడా ఈ ప్రదర్శన చేయడమే కాకుండా 14 అక్షరాల ముక్తాయింపు వరకు చెప్పగల ధీరుడు. సప్తతాళాలు 5 జాతులు, ఏ తాళాన్ని ఏ దేవుడు కనిపెట్టాడు, ఏ రాగం ఏ సమయంలో వాడాలి, ఏ రంగు ఉంటుంది మొదలగునవి భరతశాస్త్ర ప్రకారంగా చెప్పగల వ్యక్తి. వీరి శిష్యుడైన

నీలబోను సత్యం, ఈయన 3 వేలకు పై చిలుకు శిష్యులను తయారు చేశాడు. మారుతున్న కాలాన్ని గమనించి తప్పెటగుళ్లు ప్రదర్శనతో పాటుగా చెట్లు కట్టడం, కంటితో సూదిని తీయడం, ఒక చేతితో తప్పెట వాయిస్తూ వేరొక చేతితో కత్తిని పట్టుకొని కళ్లకు గంతలు కట్టుకొని వేరొకరి కళ్లపై ఉంచిన బంగాళదుంపలను గుచ్చడం, కోడిగ్రుడ్లపై నిలబడి, మట్టికుండపై నిలబడి తప్పెట వాయిస్తూ విన్యాసాలు చేయడం వీరి ప్రత్యేకత. ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాలలో బహుముఖ ప్రదర్శనలు ఇచ్చి ప్రేక్షకుల మన్ననలు గైకొన్న వ్యక్తి. వీరు యాదవ వంశస్తులు కావడం వలన చిన్నికృష్ణుని యొక్క లీలలను ఎక్కువగా చెబుతారు.



# గంగిరెద్దులు

గంగిరెద్దుల వారి కులంనకు, వృత్తికి మూలమేమిటని అడిగితే పూర్వం గజాసురుడనే రాక్షసుడు ఘోరమైన తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయ్యాక నా గర్భంలోకి ప్రవేశించి పూజలందుకోమంటాడు గజాసురుడు. అందుకు శివుడు గజాసురుని గర్భంలో లింగాకారముతో ప్రవేశించడంతో లోకమంతా చీకటి అవుతుంది. పతి వియోగాన్ని భరించలేని పార్వతి విష్ణుమూర్తిని వేడుకోగా విష్ణుమూర్తి నందీశ్వరుని గంగిరెద్దుగా అలంకరించి గంగిరెద్దు మేళాన్ని రూపకల్పన చేశాడు. దేవతలతో వివిధ రకములైన డోలు, సన్నాయి, బూర, సుత్తి మొదలగు వాయిద్యాలతో గంగిరెద్దు ఆటలను నిర్వహించి గజాసురుని వద్దకు వెళతారు. గజాసురుడు పరవసుడై గంగిరెద్దు దగ్గరకు రాగా విష్ణుమూర్తి ప్రేరణతో గంగిరెద్దు గజాసురుని కొమ్ముతో పొడవగా గజాసురుడు మరణమొంది లింగాకారంతో వున్న శివుడు బయటకు వస్తాడు. ఆ గంగిరెద్దులను లోకములో త్రిప్పకొమ్మని గంగిరెద్దుల వారికి గంగిరెద్దుతో పాటు వాయిద్యాలు కూడా ఇవ్వడం జరుగుతోంది. గంగ యొక్క ఎద్దు గంగిరెద్దు. అప్పటి నుండి గంగిరెద్దులను త్రిప్పకొని బ్రతుకుతున్నట్టు పెద్దలు చెబుతారు. ప్రాంతీయ బాణీలతో జానపద పాటలు పాడతారు. సన్యాసమ్మ పాట, రాములవారి పాట, ఈశ్వరమ్మ పాట, గంగరాజు పాట, వీర గున్నమ్మ పాట, మాల వారి మంగమ్మ మొదలగు పాటలు బాణీకట్టి పాడతారు. మధ్యలో సినిమా పాటలు కూడా పాడతారు. తమిళనాడు కర్ణాటక రాష్ట్రాలలో కూడా వీరున్నారు. అయినా వీరంతా తెలుగువారే. మహారాష్ట్రలో వీరిని నందివాల అని అంటారు. గంగిరెద్దులోళ్లమయ్యా... మేము గరీబోలమయ్యా... ఊరువాడ తిరిగేము మేము గూడు లేక ఉన్నాము అని పాడుతుంటారు. గంగిరెద్దుకు

ముస్తాబు చేసి అయ్యగారికి దండం పెట్టు... అమ్మగారికి దండంపెట్టు... డూ... డూ... బసవన్న...". అంటూ గానం చేస్తూ గంగిరెద్దులను తమ గుండెలపైకి ఎక్కించుకొని విన్యాసాలు చేస్తూ భిక్షాటన చేస్తారు. వీళ్లు యాదవులలో ఒక భాగమని చెప్పకుంటారు. కానీ వారికి వీరికి ఎటువంటి సంబంధాలు లేవు. వీరి కులస్తులలో మగవారు గంగిరెద్దు పట్టుకొని ఊరంతా తిరిగితే ఆడవారు గ్రామాలలో కరక్కాయలు, దగ్గుమందులు, గిలకలు అమ్మేవారు. నేడు ఆ పరిస్థితులు మారడంతో బొట్టులు, కాటుకలు, తిలకాలు, అద్దాలు, దువ్వెనలు, ఊరూరా అమ్ముకొని వస్తుంటారు. కొన్ని చోట్ల ఆడవారు ఈతచాపలు, బుట్టలు, గిలకలు అల్లడం చేస్తుంటారు.



# పొడపోతలవారు

ఆంధ్రప్రదేశ్‌లో చాలాకులాలకు ఆశ్రిత జాతులు ఉన్నాయి. బ్రాహ్మణులకు "విప్రవినోదాలు", వైశ్యులకు "వీరముష్టులు", విశ్వబ్రాహ్మణులకు "రుంజలు" మొ॥ వారున్నట్లే యాదవులకు ఉత్తరాంధ్రలో "పొడపోతల వారున్నారు". ఉత్తరాంధ్రలో గొల్లలు, యాదవులు, కొనారులు అని పిలవబడే ఇండ్లకు వీరు వెళ్లి వారి కులగోత్రాలను పొగుడుతూ కాటంరాజు కథను చెబుతారు. వీరిని కులగురువులు అని కూడా పిలుస్తారు. వీరు సంవత్సరానికి ఒకసారి యాదవులలోని, ఆలగొల్లలు శాఖ వారి ఇంటికి వెళ్లి యాచిస్తారు. వీరికి సొంత ఆస్తులు ఉండవు. వీరు గ్రామాలను పంచుకుంటారు. వీరు ఒక్కొక్క కుటుంబానికి 50 నుండి 300 గ్రామాల వరకు పంచుకుంటారు. పట్టణాలలో యాదవుల ఇండ్లను కూడా పంచుకుంటారు. ఒక పట్టణంలో యాదవుల ఇళ్లు ఎక్కువగా ఉంటే ఇంకొంతమంది చేరి పంచుకుంటారు. వీరు ఆయా ప్రదేశాలకు వెళ్లలేకపోతే వేరొకరికి అమ్ముకుంటారు. ఏ గ్రామంలో ఎవరు గొల్లలు, వారి గోత్రాలు ఏమిటి, ఏ ఇంటి పేర్లతో ఉన్నారో మొదలగు సంగతులన్నీ వీళ్ల దగ్గరే ఉంటాయి. ఒక్కొక్క ప్రదేశాల్లో వారం రోజుల వరకు ఉండి ఒక్కో ఇంటి వద్ద ఒక్కొక్క పూట భోజనం చేస్తూ వారు ఇచ్చే పారితోషికాన్ని తీసుకొని వారిని కులగోత్రాలతో పొగడుతారు. సంతానంలో మగవారు లేకపోతే ఆడపిల్లలు ఆ గ్రామానికి వెళతారు. ఇలా కొన్ని తరాలుగా గొల్లలకు, పొడపోతలవారికి అవినాభావ సంబంధం ఉంది. వీరి తాత ముత్తాల నుండి వచ్చిన మౌళిక విద్య, తాళపత్ర గ్రంథాలలోని కథలు నేర్చుకొని గొల్లల ఇండ్లకు వెళతారు. వీరిని తెర చీరలు వారని కూడా అంటారు. కాటమరాజు కథలను చెప్పే పటం "12 మూరల పొడవు", "6 మూరలు" వెడల్పు గల తెరపై బొమ్మలు ఉంటాయి. ఈ బొమ్మల సహాయంతో కథలు చెబుతారు. వీరు ఎన్నో తరాలుగా ఉన్నట్టు తెలుస్తోంది. ప్రస్తుతమున్నవారికి 3 తరాలు వారు మాత్రమే తెలుసు. ఎవరైనా భోజనం దగ్గర ఏదైనా లోటుచేస్తే వారిని విమర్శిస్తూ పాటలు పాడతారు. విసిగిస్తే వారి పేరున బొమ్మ కట్టి గ్రామ గ్రామాల్లో చెడ్డవారని చెబుతామని భయపెట్టి వారి వద్ద నుంచి పారితోషికం పొందుతారు. ఆఖరిరోజున కొన్ని కనికట్టు విద్యలు ప్రదర్శించి అందరినీ మెప్పిస్తారు.

# మాలమాష్టీలు

మాలలను ఆశ్రయించే కులాలను "మాలమాష్టీలు" అంటారు. వీరు సంవత్సరానికి ఒకసారి మాలకులస్తులను ఆశ్రయిస్తారు. పాటలు పాడుకుంటూ యాచన చేస్తారు. ప్రతియింటివారు రెండుపూటలా భోజనంతో పాటుగా ఎంతోకొంత పైకం ఇచ్చి పంపిస్తారు. వీరు మాలకులస్తులను తప్ప వేరెవ్వరి దగ్గర యాచన చేయరు. ఎవరి ఇంటి దగ్గర అయినా తినాలన్నా, ఏదైనా తీసుకోవాలన్నా కులపెద్దల అనుమతి తీసుకుంటారు. మాలమాష్టీలులాగే మాదిగమాష్టీలు కూడా ఉన్నారు. వీరు "సితార" చిడతలు సహాయంతో సారంగధర చరిత్ర, అళియారాణి, శశిరేఖ పరిణయం, భూలోకసుందరి, శివకుమారుడు, నల్లగులాబి కథ, సుగుణశీల, పువ్వులబుట్ట, సన్యాసమ్మ కథ, ముగ్గురు మరాఠీల కథ మొదలగునవి పాడతారు. ఈ మధ్యకాలంలో క్రైస్తవగీతాలు కూడా పాడుకుంటున్నారు. వీరు గెంతులు వేయడం, మొగ్గలు వేయడం, బండి చక్రాలు ఎత్తడం, గొర్రెపోతులను గుండెతో గుద్దడం, తలపై కొబ్బరికాయతో కొట్టుకోవడం, నీళ్లబిందెలను పళ్లతో ఎత్తడం లాంటి సాహస కార్యక్రమాలు కూడా చేస్తారు. వీరు నిరక్షరాస్యులు. తరతరాలుగా వస్తున్న విద్య, మౌలిక సాహిత్యమే వీరికి ఆధారం.



# పిట్టలదొర

ఫ్యాంటు, షర్ట్ టక్‌చేసి దొర టోపితో, చేతిలో కర్ర తుపాకి పట్టి, జాతీయ, అంతర్జాతీయ విషయాలు, ప్రభుత్వ నిర్ణయాలు చాలా చమత్కారంగా చెప్పి అందరి మన్ననలు అందుకున్నటువంటి ఓ ప్రత్యేకమైన జానపద కళారూపం ఇది. ఈ వేషాన్ని కొన్ని ప్రాంతాల్లో 'బైరూపి', 'లత్కోర్' సాబ్, 'బుడ్డర్ ఖాన్', 'తుపాకీ రాముడు' అని కూడా పిలుస్తారు. వీరి ప్రత్యేకత అంతా కూడా ఉపన్యాసమే. మాట్లాడే ప్రతిమాట అబద్ధమే. నవ్వించే చతురోక్తులు పిట్టల దొర గొప్పలు ఇలా ఉంటాయి. తన పెళ్లికి అడుగున రంధ్రం  పడ్డ అండాలో అన్నం వండించానని, ముళ్లతో చేసిన స్వీట్లు పంచానని, వీటిని తిన్న చుట్టాలు ఎంతో బాగున్నాయి అన్నారని, మహారాజులాగ తాను కూడా సముద్రానికి అడ్డంగా వంతెన కట్టిస్తే తొలకరి చినుకులకే పోయిందని, బావులు త్రవ్విస్తే ఎండాకాలంలో నిండిపోయి స్నానాలకు వెళ్లేవారంతా మునిగిపోయారని, జనాభా పెరిగిపోతున్నందున ముసలివాళ్లు అందరినీ ఏరిపారేయమని ప్రభుత్వం ఆదేశించినందున నేను ఈ గ్రామానికి రావల్సింది వచ్చిందంటాడు. ఈ పాత్ర వేసేవారు సమకాలీన సమాజంలోని లోసుగులను తమషాగా వల్లిస్తూ వేషం రక్తికట్టిస్తారు. వీరి సంభాషణ "గుడ్‌మార్నింగ్ సార్.... అదేమిటి అలా ఆశ్చర్యపోతున్నారు? నేను సార్ పిట్టలదొరని, మా తాత గుట్టలదొర, మా నాన్న తట్టలదొర సార్..." మా తాత మీ తాత దగ్గర మూడు గ్రామాలు అప్పకు తీసుకున్నారు. అది క్రమేణా ఐదు గ్రామాలు అయింది. అరువు బరువు చేటని ఆ అయిదు గ్రామాలను నెత్తిన మోసుకుంటూ వస్తుంటే, తస్సాదియ్యా కాకివచ్చి తట్టతో సహా కాళ్లతో తన్నుకుపోయింది. ఇలా సాగుతుంది వీరి మాటల గారడీ. ఎక్కడికెక్కడికో వెళ్లిపోయి తిరిగి అసలు విషయానికి వచ్చి చురకులు



వేస్తూనే జనాన్ని నవ్విస్తారు. వీరికి ఖచ్చితమైన సాహిత్యం అంటూ ఉండదు. ఆయా ప్రాంతాలలోని సామాజిక రాజకీయ పరిస్థితులు, ఇతరత్రా అంశాలను దృష్టిలో ఉంచుకొని ఈ వేషధారి తన వాక్‌చాతుర్యంతో, నటనానుభవంతో తన వేషాన్ని రక్తికట్టిస్తాడు.

# దొమ్మరాట

దొమ్మరులు చేసే విన్యాసాలను దొమ్మరాట అని పిలుస్తారు. దీనినే "ఇద్దుమానం" అని కూడా అంటారు. వీరిలో బట్టి రెడ్డి దొమ్మరి, ఆరెదొమ్మరులే కాకుండా, "కాపు ఈటె" అని కూడా వీరిని పిలుస్తారు. వీరినే మధ్యభారతంలో "డోమ్"లని అంటారు. వీరంతా లోకసంచారులు. ఇప్పటి సర్కస్‌కు ఆనాటి దొమ్మరాటలే మూలాధారం. ఈ దొమ్మరికులంలో మగవాళ్ల సాహసానికి పేరైతే స్త్రీలు సౌందర్యానికి ప్రసిద్ధి. ఒకప్పుడు ప్రభువుల సమక్షంలో వీరు విద్యను ప్రదర్శించి వారి నుండి బహుమతులు అందుకొని విలాసంగా జీవించేవారు. ఈనాడు వీరి విద్యను బాటసారులకు చూపి యాచికులుగా బ్రతుకుతున్నారు. రెండు వెదురు బొంగులను నిలబెట్టి దానికి తాడు కట్టి దానిపై కర్రతో బ్యాలెన్స్ చేసుకుంటూ రకరకాల విన్యాసాలు చేస్తారు. వెనుకకు వాలడం, తలకిందకు కాళ్లుపైకి పెట్టి జంపింగ్‌లు చేయడం, రాళ్లను చేతితో పగులగొట్టడం, ఇలా సాహసోపేతమైన పనులు చేస్తారు. గొడమీద తిరిగే స్త్రీని 'గడసాని' లేదా 'ఈటెసాని' అని అంటారు. ఈ గడకర్ర మీద తిరిగే ఈటెసాని చివరలో ఏ దిక్కున ఆగుతుందో ఆ దిక్కున శుభసూచికంగా వర్షాలు పడే ప్రాంతాలుగా గ్రామీణులు తలపోస్తారు. క్రిందనున్న మగవాడు డప్పు వాయిస్తూ మీ విద్య ప్రజలందరూ మెచ్చుకోవాలి... ఇంకా బాగా చేయాలని అంటూ చమత్కారంగా మాట్లాడతారు.

# పాములాటలు

పాములను పట్టి బుట్టలో పెట్టుకొని నాగస్వరం ఊదుతూ గ్రామాలలో తిరుగుతూ పాములను ఆడించడం మోడీలు కట్టడం వంటి వృత్తిని 'పాముల' వారు చేస్తారు. వీరి వృత్తి పాములను పట్టడం, అందుకే వీరికి పాములవారని కులం పేరుతో పిలవటం జరుగుతుంది. పుట్టలో పాములను పట్టి విషపు కోరలను పీకి బుట్టలలో పెడతారు. నాగస్వరం కాయ ఊదుతూ దానికి అనుగుణంగా పాములచే నాట్యం చేయిస్తారు. కోడెనాగు, మల్లినాగు, సంపంగినాగు, త్రాచుపాము వంటి పాములను మెడలో వేలాడ దీసుకుంటారు. లేదా నలుగురు చేరే స్థలంలో పాముల మోడీలను కడతారు. గతకాలంలో మంత్ర, తంత్ర విద్యలు కూడా ఉండేవి. కనికట్టు విద్యలను ప్రదర్శిస్తారు. ఒక అబ్బాయి వెనుకభాగం నుండి డబ్బులు తీయడం వగైరా విద్యలు ప్రదర్శిస్తారు. వీరి వృత్తి చాలా సాహసంతో కూడినది. పాములను పట్టడం, పాముకాటుకు మందివ్వడం చేస్తుంటారు. ఒక్కొక్కప్పుడు ప్రాణహాని కూడా ఉంటుంది. పాములను పట్టుకొని గ్రామాలలోను, పట్టణాలలోను ప్రదర్శించి కడుపు నింపుకుంటారు. వీరు లిపిలేని భాషను మాట్లాడతారు. సాయిబ్‌లలో ఒక తెగవారు కూడా ఈ వృత్తిని చేస్తారు. వీరు కూడా కనికట్టు విద్యలను ప్రదర్శిస్తారు. తాయెత్తులు ఇస్తారు. వీరి విన్యాసాలు, కనికట్టులు విచిత్రంగా ఉంటాయి. ఉర్దూ, తెలుగు భాషలలో మాట్లాడతారు. ఉత్తరాంధ్రలో పాములాటలు ఇటీవల తగ్గినా ఇంకా కొన్ని ప్రాంతాలవారు, మందులవారు కూడా పాములను పట్టి వాటి చర్మాలను అమ్మి బ్రతుకు జీవనం సాగిస్తున్నారు. తెల్ల ఈశ్వరి వేరును ఉపయోగించి పాములను పడతారు. ఈశ్వరుడు వేరు కాబట్టి పాములు దీనికి లొంగుతాయని చెబుతారు.



# చెక్కభజనలు

ఇది శాస్త్రీయమైన జానపద నృత్యకళ. ఎంతో క్రమశిక్షణతోనే నేర్వాలి. అందరూ సమానంగా అడుగులు వేయాలి. వలయాకారంగా తిరగాలి. వెనకకు ముందుకు అడుగులు వేయాలి. మూడు నాలుగు అడుగులు, తాళానికి తగినట్లుగా అడుగులు వేయాలి. ఒకే రకంగా ఘల్లు ఘల్లుమనేటట్లు చేతులలోని చెక్కలను ఆడించాలి. అందరూ కలిసికట్టుగా ఒకేసారి తాళం వేయాలి. తాళానికి తగినట్టు పాటపాడాలి. కాళ్లకు మువ్వలు (గజ్జెలు) కట్టుకోవాలి. ఒకేసారి ఎగరటం, కూర్చోవటం, లేవటం, గుండ్రంగా తిరగటం చెక్కభజన విశిష్టత. ప్రతిపాటకు అడుగులు మార్చుతారు. ఇది వ్యాయామంతో కూడిన కళారూపం, చెక్కభజనలలో ఎవరిబాణీ వారిదే. ఈ భజనలలో భక్తి ముక్తి ఉంటుంది. అమ్మవారి జాతరలలోను ఈ చెక్కభజనలు ప్రదర్శిస్తారు.

చెక్కభజన ప్రారంభ సమయంలో గురువు చాలా శ్రమపడవలసి ఉంటుంది. ప్రతివారు ఎలానిలబడాలి? ఒక్కొక్కరికి ప్రతి భంగిమా వివరిస్తూ వలయాకారంగా ప్రతి ఒక్కరి చేత చేయిస్తాడు. ఇది ప్రాథమిక దశ, తరువాత ఆది అడుగు, రెండవ అడుగు, మూడవ అడుగు, నాల్గవ అడుగు ఇలా పది  అడుగుల వరకూ వేయిస్తాడు.

భజన ప్రారంభించే ముందు దేవుని పటం మధ్యలో పెట్టి కొబ్బరి కాయకొట్టి పూజచేసి చెక్కలతో సాష్టాంగ నమస్కారము చేస్తారు. అందరూ వలయాకారంగా నిలబడి లయతో చెక్కలు మ్రోగిస్తారు. గురువు పాడగా వంత పాడతారు. తరువాత ఒక్కొక్క అడుగు వేస్తారు. కుడికాలుతో, ఎడమ కాలితోను చాకచక్యంగా ఆడిస్తూ ఊపందు కుంటారు. ఒకేసారి అకస్మాత్తుగా 'హరిలో రంగ హరి' అంటూ ఆగిపోతారు. మళ్లీ ప్రారంభిస్తారు. చాల క్రమశిక్షణతో ఉంటుంది.

వీరు పంచెలను కట్టుకొని రంగుల తలగుడ్డలను నడుముకు కడతారు. పంచెలను నృత్యానికి అడ్డుతగలకుండా ఉండడానికి సైకిల్ కట్టులాగా మడిచికడతారు. అడుగు పొడుగైన చెక్కలను తయారు చేసుకొని, రెండు ప్రక్కల ధ్వని రావడానికి గుండ్రటి ఇనుపబిళ్లలనుగాని, ఇత్తడిబిళ్లలనుగాని రెండేసి చొప్పున అమర్చుతారు. తాళం ప్రకారం చెక్కలను కొట్టేటప్పుడు ఈ బిళ్లలు మంచి శబ్దానిస్తాయి. అందరూ ఒకే శృతిలో చెక్కలను వినిపించి ఉత్సాహపరుస్తారు. వీరు భారత, రామాయణ, భాగవతాది పురాణాలలోని అంశాలను పాడుతారు. అందుచేత స్త్రీ పాత్రలు కూడా పాడతారు. లేదంటే స్త్రీ వేషం కూడా వేసుకొని సీతారాముడు, ద్రౌపది కౌరవులు వంటి పాత్రలు కూడా మధ్యలో వేస్తారు.



# డప్పు నృత్యం

ఈ డప్పుల వాయిద్యాన్నే తప్పెట్ల వాయిద్యమంటారు. వీటినే రాయలసీమ ప్రాంతాల్లో కనక తప్పెట్లంటారు. ఈ వాయిద్యాన్ని మాదిగ కులస్థులు ఎక్కువగా వాయిస్తూ వుంటారు.

ఈనాటికీ ప్రతి పల్లెలోనూ, ఒక కార్యక్రమాన్ని గాని, ఒక విశేషాన్ని గాని ప్రజలందరికీ తెలియజెప్పాలంటే, ఒకడప్పుతో ఊరంతా ఎటువంటి విషయాన్నైనా చాటింపు వేయిస్తారు. చాటిస్తారు. వివాహాలకూ, అమ్మవారి జాతర్లకూ, వీరుళ్ళ పూజలకూ ఈ వాయిద్యాన్ని ఎక్కువగా ఉపయోగిస్తూ



వుంటారు. వాయిద్యం చాలా ఉద్రేక పూరితంగా వుంటుంది. ఈ డప్పులను వేపచెక్కలతోనూ, గండ్రపు చెక్కలతోనూ చట్రంగా తయారుచేసి గేదెదూడ చర్మాన్ని ఒక ప్రక్క మూసి నిప్పసెగమీద కాచి వాయిస్తే కణకణమని శబ్దం వస్తుంది. ఈ డప్పులతో వలయాకారంగా నిలబడి నృత్యం చేస్తారు. నేడు చర్మాలు దొరకక ప్లాస్టిక్ టేపులను కట్టి వాయిస్తున్నారు. కోలాట నృత్యంలో అందరూ చిడతలు ఉపయోగిస్తే ఇందులో అందరూ డప్పులను చంకల్లో ధరించి వాయిస్తూ ఆ డప్పులను మ్రోయించే పుల్లలతో ఒకరికి ఒకరు కోలాటం చేసుకుంటూ ఎగిరి ఎగిరి గజ్జెల కాళ్లతో నృత్యం చేస్తూ అద్భుతంగా కోలాటం చేస్తారు. కృష్ణాజిల్లాలో ఈ నృత్యం మంచి ప్రాచుర్యంలో ఉంది. నర్తనం చేస్తూనే పిరమిడ్స్ కట్టడంలో వీరు సిద్ధహస్తులు. సప్తతాళాలను పంచవిధగతులను వాయించడంలో వీరికి వీరే సాటి. ఈ చాటింపు వేసే వ్యక్తిని ఖారిక అని పిలుస్తారు.

# గరగ నృత్యం

గరగ నృత్య కళాకారులు ముఖ్యంగా దేవతలను ఆరాధిస్తారు. వీరు జాతర్ల సమయాల్లో ఐదు శిరస్సు గల నాగును ఇత్తడి కలశం గల కుండకు అమర్చి మధ్యలో చీరను కట్టి సర్వాంగసుందరంగా అలంకరించి శిరస్సుపై ధరించి నృత్యం చేస్తారు. ఇది భక్తి రసప్రదానంగా కొనసాగుతుంది. వీరు ఎక్కువగా తూర్పుగోదావరి జిల్లాలో కనిపిస్తారు. వీరికి సన్నాయి, డోలు, డప్పు, తాసా మొదలగు వాయిద్యాల సహకారం లభిస్తుంది. స్త్రీలు, పురుషులు ఈ నాట్యాన్ని ప్రదర్శిస్తారు. తలకు పాగా చుట్టుకొని మంచి మెరుపులతో కూడిన జుబ్బాలను ధరించి కాళ్లకు సిరిమువ్వలను అలంకరించుకొని నాట్యం చేస్తారు. వీరిలో కొంతమంది ఎవరైనా డబ్బులు ఇస్తే వాటిని క్రింద పెట్టమని నాట్యం చేస్తూనే క్రింద పడుకొని కళ్లతో ఆ డబ్బులను అందుకుంటారు. ప్రస్తుత పరిస్థితుల్లో అమ్మవారి జాతరలో పండుగ పబ్బాలలో వివాహాది వేడుకలలో ఈ నాట్యాన్ని ఎక్కువగా ప్రదర్శిస్తుంటారు.

# బుట్ట బొమ్మలు

"బుట్ట బొమ్మలనే" కొన్ని ప్రాంతాలలో "పాల బొమ్మలు" లేదా "పాముల బొమ్మలని" కూడా అంటారు. ఇవి గ్రామదేవత పండుగలలో ప్రదర్శిస్తారు. ఇవి పేడ, చింతపిక్కలు, వెదురు, రంగులు మొదలగు వాటితో తయారు చేస్తారు. ప్రతి జతకు ఇద్దరువ్యక్తులు అవసరం. పాములవాడు నాగస్వరంకాయ ఊదుతూ ఉన్నట్లు, కృష్ణుడు, రాధ, శివుడు, పార్వతి మరియు అనేక దేవుళ్ల బొమ్మలు, ఇతరత్రా బొమ్మలు తయారుచేస్తున్నారు. ఈ బొమ్మలలోకి మనుషులు దూరి కాళ్లకు గజ్జలు కట్టుకుని సన్నాయి, డప్పులు వాయిద్యాలకు అనుగుణంగా అడుగులు వేస్తారు. జనసందోహంమధ్య ఈ బొమ్మలలో దూరి ఆడతారు. ఆటకు పోటీపడతారు. పండగలు, ఉత్సవాలకు మరింత నిండుగా ఉంటాయి. వీటిని అతి జాగ్రత్తగా కాపాడాలి. ప్రదర్శన లేని రోజులలో చాలా జాగ్రత్తగా కాపాడతారు. ఎలుకలు, పురుగులు కొట్టివేయకుండా కాపాడతారు.

కంటికి ఇంపైన రంగులలో బుట్టబొమ్మలు తయారుచేస్తారు. బొమ్మలపై భాగమంతా బొమ్మ ఆకారాన్ని పోలి ఉండి, లోపలి భాగమంతా డొల్లగా ఉండి కళ్లు నోటి ప్రాంతంలో రంధ్రాలను కలిగి ఉంటాయి. బొమ్మలోపలి భాగంలోకి వ్యక్తులు దూరి నృత్యం చేస్తుంటే నిజంగా ఆ బొమ్మే నృత్యం చేస్తున్నట్లు కనిపిస్తుంది. పశ్చిమ గోదావరి జిల్లా తణుకుకు చెందిన కట్టా సూర్యనారాయణ బుట్ట బొమ్మల కళని జాతీయ స్థాయికి తీసుకువెళ్లిన కళాకారుడు, కోస్తా, రాయలసీమలలోఈ బొమ్మలు కలవు.

ఉత్తరాంధ్రాలో శ్రీకాకుళం జిల్లా కాశీబుగ్గ బ్రాహ్మణవీధిలో ఈ బొమ్మల కళాకారులున్నారు. టెక్కలి పరిసర ప్రాంతాలలోను, విశాఖ జిల్లాలోను ఈ కళకు చెందిన బొమ్మలు, కళాకారులు ఉన్నారు.



# కత్తిసాము, కర్రసాము

ప్రాచీన కాలంలో రక్షణ సాధనాలుగా సాము, గరిడీలు వెలిసాయి. ఒకప్పుడు ప్రతి రెండు మూడు గ్రామాలకు కత్తిసాము, కర్రసాము, గరిడీ బృందాలుండేవి. పల్లెవాసులు తీరిక సమయంలో ఈ విద్యలను అభ్యాసము చేసేవారు. కత్తిసాము, కర్రసాము, డాలు - కత్తి, బాణాకర్ర, ఈటెలు, బల్లెం మొదలగు సాధనాలతో ఈ సాము గారడీ విద్యలు అభ్యసించేవారు. గురువు వద్ద ఈ విద్యలు నేర్చి అమ్మవారి పండుగలలో ప్రదర్శిస్తారు. ఆధునిక ఆయుధాలు, తుపాకిగుండ్లు రావడంతో ఈ విద్యలు మూలపడినా ఇంకా అక్కడక్కడ ఈవిద్యలు ప్రదర్శించబడుతున్నాయి. ప్రాచీన కాలంలో దక్షిణదేశంలో ఈ సాముగరిడీ విశేషంగా ప్రచారంలో ఉండేవి. వీటికి మూడు వందల ఏళ్లకు పైగా చరిత్ర ఉంది. విజయనగర రాజులు ఈ విద్యలను ఎంతో ప్రోత్సహించేవారు. ఆనాడు యుద్ధ తంత్ర సాధనాలుగా ఉపయోగపడిన ఈ విద్యలు ఈనాడు కళారూపాలుగా పండుగకు నిండుదనాన్ని చేకూర్చే సాధనాలుగా ఉపయోగపడుతున్నాయి. ఇది సాంప్రదాయక కళ, తెలుగునాట పెద్దగ్రామాలలో సాముగరిడీ శాలలుండేవి.



రాజులు తమ ఆస్థానాలలో మల్లయుద్ధం, కత్తిసాము, బాణావిద్య, లోడీలు తిప్పటం, దండీలు బస్కీలు తీయటంలో మంచి నేర్పరులై వారిని పోషించి ఈ విద్యలను ఆదరించేవారు. ఇతర రాజ్యాలనుండి వచ్చేవారికి వీరికి పోటీలు నిర్వహించేవారు. జమీందారిపాలన ఉన్న విజయనగరం, బొబ్బిలి, సాలూరు, మేరంగి, కుమిలి మొదలగు ప్రాంతాలలో ఈ కళలుండేవి. మనిషి పొట్టమీద దారం గుచ్చిన అరటికాయను వుంచి, దారం తెగకుండా కత్తితో ఆ అరటి కాయను నరకడం, మనిషి పొట్ట మీద తమలపాకు పెట్టి కత్తితో రెండు ముక్కలు చేయడం, అరటి బోదెమీద పసి పిల్లవాన్ని ఉంచి కత్తితో విన్యాసం చేస్తూ ఆ బాలుడు నేలపడకుండా అరటి బోదెను నరకడం వంటి అద్భుత విన్యాసాలను చక్కగా ప్రదర్శిస్తారు.

విజయనగరం కోట దగ్గర ఉన్న డాక్టర్ పి.వి.జి. రాజు స్మారక సమరాంగణ కళాశాలలో ఎందరికో కత్తి, కర్రసాములలోను, గండుపులి వేషంలోను శిక్షణనిస్తున్నారు. వీరి ప్రదర్శనలలో అగ్గిబరాట, దివిటీలు, నాలుగు కత్తులతో ప్రదర్శన, కత్తియుద్ధం, కత్తి, డాలు విన్యాసం (రాజస్థాన్ కళ) ప్రదర్శనలో అడుగులు వేయటం వగైరా చేస్తారు. విజయనగరం సిరిమాను సంబరాలలో వీరి కళ ప్రదర్శిస్తారు.



# తాషా వాయిద్యం

ఏక నేత్రే రుద్ర శబ్దం
దిగాష్ట మహేశ్వరః
శబ్దంచ లోకేణాం
ఆది మూర్తి, తాషహా

శివ పార్వతుల కళ్యాణ సమయంలో నారద తుంబురులు శివుని ఢమరుకాన్ని రెండుగా చేసి ఆ ఢమరకాన్ని తాషా వాయిద్యంగా ఉపయోగించారని ఒక కథ. ఇదే తాషా.

దీనిని భేరీగా కూడా ఇప్పడు ఉపయోగిస్తున్నారు. ఈ వాయిద్యానికి ఎడమ కుడి తేడా లేదు. ఒకే కన్నుతో కట్టుబడి ఉంటుంది. మట్టితో చేయబడిన కుండతో చేస్తారు. మహేశ్వరునికి ఇష్టమైన పేకబెత్తం కర్రతో వాయించబడుతుంది. ఈ వాయిద్యానికి తాళాలు (1) ధృవతాళం (2) మచ్చుతాళం (3) రూపక తాళం (4) జంపెతాళం (5) త్రిపుట తాళం (6) ఆది తాళం (7) ఏకతాళ జతులు (1) శతురశ జాతి (2) తిశ్రజాతి (3) మిశ్రజాతి (4) ఖండజాతి (5) సంకీర్ణజాతులను లయబద్ధంగా వాయించుటకు అనువైన వాద్యం.

ఈ వాద్యాన్ని వివాహాది శుభకార్యాలలో, అమ్మవారి జాతరలలో, వీరభద్రుని ఉత్సవాల్లో, ఊరేగింపులకు తప్పక ఉపయోగిస్తారు. ఈ కళాకారులు ఎక్కువ (1) మంగలి (2) చాకలి (3) కుమ్మరి (4) దూదేకుల సాయిబుల కులాలలో ఉన్నారు. ముఖ్యంగా తూర్పు గోదావరి జిల్లా, పశ్చిమ గోదావరి జిల్లాలలో ఉన్నారు. యువకులు ఈ కళను అభ్యసించుటకు ఉత్సాహం చూపుచున్నారు నేర్చుకొన్నవారు జీవన భృతిని పొందుచున్నారు.



# గొల్లభామ కలాపం

ఆత్మకు, పరమాత్మకు, పవిత్రాత్మకు ఉన్న అబేధ్యాన్ని తెలియజేసే గొప్ప జానపద కళాంశం ఈ గొల్లభామ కలాపం. పూర్వం రోజుల్లో అగ్రహారాల్లోకి పాలు తీసుకువచ్చిన గొల్లభామలను బ్రహ్మముఖం నుండి పుట్టిన మేము బ్రాహ్మణులము అంటూ ఈ గొల్లభామలను హేళన చేస్తూ వుండేవారట. అప్పుడు ఈ గొల్లభామలు వారికి ధీటుగా వారి వాగ్ధాటితో తిరుగు సమాధానాన్ని అందించేవారట. దీనిని ఇతివృత్తంగా తీసుకొని ఈ కళారూపం ఆవిర్భవించింది.

శ్రీమతి తరికొండ వెంగమాంబగారు రచించిన యక్షగానాలు ఈ గొల్లభామా కలాపానికి మూలం. శృంగారం కాస్తా ఎక్కువగా ఉన్నప్పటికీ నాట్యానికి తగ్గట్టుగా మద్దెల తాళాలు ఉపయోగిస్తూ వర్ణాలు, ద్విపదులు, జావళీలు, దరువులకు ప్రాధాన్యతనిస్తూ ఈ సంప్రదాయ కథ కొనసాగుతుంది. అన్నాబత్తుల లక్ష్మీమంగతాయారు ఈ గొల్లకలాపానికి శిక్షణనిచ్చేవారు. వీరిది తూర్పు గోదావరి జిల్లాలోని ముమ్మిడివరం గ్రామం. వీరిది దేవదాసి సంప్రదాయం. ముమ్మిడివరం ఉమాసూరేశ్వరస్వామి వారి దేవస్థానంలో దేవగణికలు (దేవదాసి నర్తకులు). వీరి తరువాత తరంలో శ్రీమతి అలివేలు మంగతాయారు తమ ఇంటి వద్దే ఈ విద్యకు ఉచిత శిక్షణ ఇవ్వడం వల్ల చాలామంది ఈ విద్యను అభ్యసించినారు. గ్రామాల్లో పెళ్లిళ్లు, ఉత్సవాలకు ఈ ప్రదర్శనకు ప్రాధాన్యత వుండేది.



# గొల్లసదువు

గొల్ల చదువంతా యాదవుల కులదైవం గంగమ్మ, యాదవ వీరుడు కాటమరాజు గూర్చి. వీరు రాత్రిపూట నెలలకొద్ది ఈ పాట పాడుతారు. ఒకవ్యక్తి పాట పాడుతుండగా ఇద్దరు వ్యక్తులు 'ఓ' అని వంత పాడతారు. దీనినే 'ఓపాట' అని కూడా అంటారు. గావు సంబరం రెండవ రోజున రాత్రి మేకపోతును గొల్లసదువు చదివి గావు పట్టి నోటితో కొరుకుతారు. ముందుగా మేకపోతును పందిరిలో కన్నిలేకుండా విడిచి పెడతారు. చదువోడు చదువుతో మేకపోతు దానంతటదే తొంగుంటుంది (పడుకుంటుంది).

గొల్ల చదువులో గంగాదేవి పుట్టుక, మహిమలు, కాటమరాజు, గంగాదేవీల వివాహము, నెల్లూరు సిద్ధిరాజులతో యుద్ధం వగైరాలు ఖండ ఖండాలుగా చెబుతారు. 'గొల్ల చదువుకు' తెంపుండదు. అనేక శాఖలుగా పాటపోతుంది.

ఓరినాయనా! భూమి పుట్టలేదు-ఆకాశం పుట్టలేదు. చెట్టు లేదు-సేమ లేదు. పక్షి జన్మిస్తుంది. పక్షి భూమిపై ఒక రెక్క చాపి మూడుగుడ్లు పెడుతుంది. ఆకలేసి ఒక గుడ్డు ఆరగించింది. భూమి పుట్టలేదు-ఈశ్వరుడు పుట్టలేదు - విష్ణువు పుట్టలేనప్పడు శక్తి పుట్టింది. అలరాజు, పెద్దిరాజులకు సంతానం లేనపుడు పక్షి కాపాడింది. గంగమ్మ కాటమరాజు భార్య - పెద్దిరాజు కోడలు, పెద్దిరాజుల, పెద్దిమదేవిల కొడుకు, కాటమరాజు, భార్య పాపనూక గంగ దైవాంశ సంభూతురాలు, ఆలవారి ఇంట జన్మించింది. మర్ల పిన్నయ్య కుమార్తె మర్లగంగమ్మ, దశావతారాలలో రాముడుకు సీతగా, విష్ణుమూర్తికి లక్ష్మిగా, శ్రీకృష్ణావతారంలో చెంచీతగా, కాటమరాజుకు గంగాదేవిగా అవతరించింది.

కాటమరాజుకు గంగకు పెళ్లి జరిగినా అసలు సంసారపక్షమే జరుగలేదు. కలియుగంలో కాంతతో పొందికలు లేవు. మాట సూత్రానికి మంగళ సూత్రంగాని స్త్రీతో పొందికలు సృష్టిలో లేవు. రంభతో పొందికలు రాజ్యాన లేవు... ఇలా సాగుతుంది వీరిగొల్ల చదువు, కాటమరాజు స్వర్గంలోకి వెళ్ళిపోతున్నప్పడు రథచక్రాన్ని గంగపట్టు కుంటుంది. అప్పడు యాదవు లందరూ నీకు గావు సంబరాలు చేసి నిత్యం కొలుస్తారని పలుకుతాడు.

# రెల్లిపాట

ఉత్తరాంధ్రలో రెల్లి కులస్తులున్నారు. వీరు ప్రధానంగా తోటలుకాయటం, పళ్లు అమ్మటం ప్రధాన వృత్తిగా జీవిస్తున్నారు. రెల్లి యువతులు, పెద్దవారు పళ్లు అమ్ముతారు. వారు వచ్చీరాని తెలుగు భాష రెల్లిభాష (ఒరియభాషలాంటిది) మాట్లాడుకుంటూ పళ్ల అమ్ముతారు. ఈ భాషకు లిపి లేదు.

పళ్లు అమ్ముకునే రెల్లి యువతిని నాయుడు కులానికి చెందిన ఒక వ్యక్తి ప్రేమిస్తానంటాడు. పెళ్లి జేసుకుంటానని అంటాడు. అయితే రెల్లి చిన్నది దానిని తిరస్కరిస్తుంది. మీరు చూస్తే పెద్దకులం, మేం చూస్తే చిన్న కులమని రెల్లిపాట ఉత్తరాంధ్రలో బాగా ప్రసిద్ధిపొందింది. ఈ రెల్లిపాట జముకుల కథ వారు ఒక బాణీలోను, బుర్ర కథలో మంచి ఒక బాణిగాను పల్లెకారులు ఇంకో విధంగా పాడుతుంటారు. అర్థం ఒక్కటే, చరణాలు వేరు. ☼



రంగోయి గ్రామంలో తెప్పల అచ్చెమ్మ అనే స్త్రీ ఈ పాట పాడుతుంటే రంగోయి పూజారి గారు (కళాకారుడు) విని దీనిని వేరే బాణీ కూర్చి స్వయంగా పాడి రెల్లిపాటను ప్రదర్శించారు. మదనమోహన్ పాణిగ్రాహిగారు., నాయుడు గారు, గేదెల లింగరాజు (రెల్లి చిన్నది గాను) పగటి వేషాలతో ఈ పాట మందస, పలాస, సోంపేట ప్రాంతాలలో ప్రదర్శించి గొప్ప పేరు తెచ్చారు. వాళ్లిద్దరు కలసి పాడిన రెల్లి పాట అనేక గ్రామాలలో పండుగలు, ఉత్సవాలలో ప్రదర్శింపబడింది. డప్పు, జముకు సహాయంతో ఈ పాట బాగా జనాదరణ పొందింది.

నాయుడా మా నాయుడు జమపురి జమ్మప్పల నాయుడోయి నాయుడా ఇలా పాట సాగుతుంది. ఈపాటనే ఇటీవల 'జయం' సినిమాలో రానురానంటునే చిన్నదో చిన్నదో రాములోరి గుడికొచ్చే చిన్నదో చిన్నదిగా కూర్చారు. బుర్ర కథలో రెల్లిపాటపై కొంత సంభాషణ ఉంటుంది. రెల్లీలు మట్లాడుకొనే యాసతో సంభాషిస్తున్నారని, రెల్లి భాషను కించపరస్తున్నారని రెల్లి కులస్థులు కొందరు ఈపాటను నిషేధించాలని అప్పుడప్పుడు పత్రికలలో ప్రకటన ఇచ్చారు. అయితే కళాత్మక దృష్టితో చూస్తే ఇది పల్లె ప్రజలకు ఆనందన్నిచ్చే వేషం దీనిని వేరే దృష్టితో చూడకూడదు. ☼

# పందిరిపాట

విజయనగరం జిల్లా పక్కిచింతాడ గ్రామంనకు చెందినవారు ఈ పందిరిపాటలో సుప్రసిద్ధులు. ఒకప్పుడు ఈ గ్రామంలోనే పది బృందాలు వుండేవి. ఇప్పడు ఆదరణ లేక వ్యవసాయ కులీలుగా మారిపోయారు. ఆడవారు పాడే పాటగా ప్రసిద్ధిచెందిన ఈ పాట మంచి ప్రాశస్త్యం పొందింది. ఒక స్త్రీ మధ్యన పాడుతుండగా ఇద్దరు వంతలు వెనుక పాడుతుంటారు. మధ్య మధ్యలో హాస్యం కూడా ఉంటుంది. వీరు దశావతారాలు, గంగా వివాహం, ధర్మాంగద చరిత్ర, త్రైలోక్యసుందరి మొదలగు పాటలు పాడతారు. గౌరి పౌర్ణమి, శ్రీరామనవమి, దీపావళి, శివరాత్రి రోజుల్లో పగటిపూట ఈ పాట పాడతారు. పందిరివేసి పందిరిలో పాడే పాట గనుక దీనికి పందిరిపాట అన్న పేరు వచ్చింది. ఫిబ్రవరి నుండి మే నెల వరకు ఈ కళాకారులకు మంచి అవకాశాలు ఉంటాయి. మంచిరాగంతో పాటపాడుతూ, డోలక్ దరువులకు తగ్గట్టుగా నాట్యం చేస్తూ ఆ పాటలతో అందరినీ ఆకట్టుకుంటారు.

# విప్ర వినోదులు

విప్ర వినోదులు విజయనగర సామ్రాజ్య కాలంలో ఉన్నారు. వీరు ఆంధ్రదేశమంతటా ఉన్నట్టు ఆధారాలు ఉన్నాయి. వీరి వృత్తి విప్రులను యాచించడమే. వీరి ప్రదర్శన కూడా ఇంద్రజాలమే. వీరి దళసభ్యులు నలుగురు ఉంటారు. వీరి ప్రదర్శనను విప్రుల ఇళ్లల్లోనూ విశాల బహిరంగ ప్రదేశాల్లోనూ ప్రదర్శిస్తారు. వీరి ప్రదర్శన సామగ్రి ఐదారు శాలువాలు, ఒక కొయ్య అలమర, ఒక తాళపత్ర గ్రంథం, రెండు జతల తాళాలు. వీరి ప్రదర్శన ఒక చిన్న పందిరిలో జరుగుతుంది. పందిరి చుట్టూ శాలువాలు కడతారు. ఆ తెరల మధ్య ఖాళీ అలమర ఉంచుతారు. ఇరువురు వ్యక్తులు చెరొక ప్రక్కన చేరి తాళాలు వాయిస్తారు. ఇంతలో ప్రేక్షకులు గుమ్మిగూడేవారు. తెరలన్నీ ఎత్తి ఖాళీ అలమర చూపిస్తారు. తరువాత దళముఖ్యుడు ప్రాచీన తాటాకుల గ్రంథంతో తెరలమధ్యకు వెళతాడు. 10 నిమిషాల వరకు ఆయన బయటకు రాడు. ఈ లోగా భజన జరుగుతూ ఉంటుంది. తరువాత తెరను తొలగిస్తారు. అంతవరకూ ఖాళీగా ఉన్న అలమరలో దేవతల విగ్రహాలు, దీపారాధన కుందులు అనేక రకాల పిండివంటలు ప్రత్యక్షమవుతాయి. అంతేకాకుండా వీరు ఇంటింటికి తిరుగుతున్నపుడు విగ్రహాలను, కప్పలను, చిలకలను, విభూదిని అరచేతిలో సృష్టించి టక్కు, టమారా, గజకర్ణ, గోకర్ణ, ఇంద్రజాల, మహేంద్రజాలాది విద్యలను ప్రదర్శిస్తూ పబ్బం గడుపుకుంటారు.

# పండరి భజనలు

ఈ కళారూపం మహారాష్ట్రానికి చెందినది. పండరిపురంలో పాండురంగని వేడుకుంటూ చేసే భజన ఇది. పండరి భక్తులద్వారా దేశమంతటా వ్యాపించింది. చేతిలో చిడతలు, నోటితోపాట డోలక్, మద్దెల, కంజీరా, తంబూరా, తాళాలు, హార్మోనియం మొదలైన వాయిద్యాలతో కూడిన పండరి భజన ఎంతో ఆనందంగా ఉంటుంది. వీరికి గురువు ఉంటాడు. ఈ నృత్యంలో చిన్నపిల్లలే ఎక్కువగా పాల్గొంటారు. పిల్లలకు కాషాయగుడ్డ నడుముకు కట్టించి పసుపుపచ్చని జెండాను మూరెడు పొడవు కర్రకు కట్టించి, కుడిచేతితో పట్టిస్తారు. కాళ్ళకు గజ్జెలు కట్టి పిల్లలను గుండ్రంగా ఉంచి మధ్యలో గురువు ఉండి పాడుతుండగా పిల్లలు అభినయిస్తారు.

విట్టల్ విట్టల్-జైజై విట్టల్....

రండీ పుణ్యాత్ములారా.... ఈ రంగడు భజనకు రండీ ధర్మాత్ములారా... అంటూ పాటలుపాడుతారు. కృష్ణునికి సంబంధించిన పాటలు కూడా ఉంటాయి. గోపికలుగా కూడా అభినయిస్తారు. ఇటువంటి కళారూపం అక్కడక్కడ ఉన్నాయి.

విశాఖపట్నం జిల్లాలోని యలమంచిలి ప్రాంతంలోనున్న భాగవతుల ఛారిటబుల్ ట్రస్ట్ వారు పరిసర గ్రామాల్లో ఈ భజనలకు శిక్షణనిచ్చి ఆధ్యాత్మిక చింతనవైపు తీసుకువెళుతున్నారు. వీరి ప్రోత్సాహంతో తిరుమల కొండపై నిత్య భజన కార్యక్రమములో ఈ ప్రాంతం వారు చాలామంది పాల్గొన్నారు.



## జేగంట భాగవతులు

"ఎందుకయ్యా వుంచినావు బందిఖానలో రామయ్యా తండ్రీ, ఎందుకయ్యా వుంచినావు' అని రామదాసు బందిఖానా విశేషాన్ని పాటరూపంలో వర్ణిస్తూ గంటి భాగవతులు ఆంధ్రదేశపు పల్లెల్లో సంచారం చేస్తూ వుంటారు. వీరు ఒక చేతిలో ఒక పెద్ద జేగంట, రెండవ చేతిలో సీతారామలక్ష్మణ విగ్రహాలతో కూడిన ఒక దీపపు స్తంభాన్ని పట్టుకుని, చంకలో నెమలి ఈకలపింఛం, కాళ్ళకు గజ్జెలు కట్టి నృత్యం చేస్తూ, నోటితో పాట పాడుతూ ఒక చేతితో జేగంట వాయిస్తూ యింటింటి ముందూ స్తంభాన్నుంచి స్తంభంచుట్టూ కలయ దిరుగుతూ నృత్యంతో, పాటతో, వాయిద్యంతో చుట్టూ మూగిన ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేస్తూ ఇంటింటికీ తిరిగి యాచిస్తూ వుంటారు. ఈ నృత్యం ఎంచక్కా భక్తిభావంతో నడుస్తుంది.

## గంటి భాగవతులు

ఆంధ్రదేశంలో కొంతకాలం క్రితం గంటి భాగవతులు అని ఒక తెగ ఉండేది. ఈ భాగవతం అంటే బొమ్మతోపాటు మనిషి కూడా ఆడుతూ వుండేవాడు. ఇలా బొమ్మలు ఆడించేవారిని 'గంటి భాగవతులు' అనేవారు. వీరు ఎక్కువగా భాగవత గాధల్నే ప్రచారంచేయడం వల్ల వీరికి 'భాగవతులు' అనే పేరు వచ్చింది.

ఈ భాగవతులు నలుగురు, లేక ఐదుగురు కలిసి ఒక దీపపు స్థంభాన్ని పట్టుకుని పాటలతో, పద్యాలతో బయలుదేరి ఈ బొమ్మలాటలను ప్రదర్శించేవారు. ☼

# గొల్లభాగవతులు

కృష్ణుడు గొల్లవాడనే విశ్వాసం కొద్దీ కృష్ణలీలలను, కృష్ణ భాగవతాలను గొల్ల భాగవతులే ప్రదర్శించేవారు. వీరే యాదవులు, యాదవకులానికి గర్వకారకుడైన శ్రీకృష్ణభగవానుడు తమ జాతివాడనే అభిమానంకొద్దీ వీరు వీధి భాగవతాలను ప్రదర్శించేవారు. ప్రథమంలో భక్తికొద్దీ ఈ కళద్వారా పౌరాణిక ప్రచారం జరిగినా కొంతకాలానికి అన్ని కళలతో బాటు వీరి భాగవతాలు యాచనకే ఉపయోగించేవారు. పెళ్లిళ్లకూ, ఉత్సవాలకూ, తిరుణాళ్లకూ, పండుగలకూ, వ్యవసాయ తరుణం అయిన తరువాత తీరుబడిగానూ వీటిని ప్రదర్శించేవారు ఈ భాగవతాలు ఒకే గ్రామంలో వీధి వీధినకూడా ప్రదర్శించేవారు. ఇంటింటా చందాలు వసూలు చేసేవారు. ప్రజలు చందాలతోబాటు దుస్తులు. కిరీటాలు కూడా బహుకరించేవారు. పదిహేను సంవత్సరాల క్రితం వరకు ఎంతో ప్రచారంలో వున్న వీరి ఈ భాగవతాలు ఈనాడు మన దురదృష్టం కొద్దీ మచ్చుకు కూడా కనబడుటలేదు.

# యానాది భాగవతులు

కూచిపూడి భాగవతుల ప్రభావం అనేక జాతుల మీద, కులాల మీద పడింది. ఒక నాటక సమాజాన్ని చూసి అనేక సమాజాలు ఉద్భవించి నట్లు కులాల వారిగా కూడా భాగవతులు తయారయ్యారు. యానాదులు ఎక్కువగా నెల్లూరు, గుంటూరు జిల్లాల్లో వున్నారు. వీళ్ల అసలు వృత్తి రాత్రిళ్లుగ్రామాలను కాపలా కాయటం. వీరిలో కొంతమంది యువకులు ఉత్సాహంతో భాగవతుల జట్లుగా తయారయ్యారు. యానాది భాగవతుల్లో స్త్రీ పాత్రలు స్త్రీలు, పిల్లల పాత్రలు పిల్లలు, పురుష పాత్రలు వారి భర్తలు ధరిస్తూ ఉంటారు. దాదాపు జట్టులోని వారందరూ ఏదో ఒక వాయిద్యమో, తాళమో లేక వంతపాట పాడటమో చేస్తూంటారు. వీరిలో చిన్నపువ్వుల మాణిక్యమని, పెద మాణిక్యమని అన్న ఇద్దరు స్త్రీలు ఆంధ్రరాష్ట్రంలో ఎంతో పేరు ప్రఖ్యాతులు గడించారు.

## మాలభాగవతులు

మాలభాగవతులని కొందరు ఆంధ్రదేశంలో అక్కడక్కడా ఉన్నారు. వీరు హరిజనుల ఇండ్లలో వివాహాలకు భోగ ఆటలు ఆడేవారు. వీరిలో కొంతమంది భాగవతుల జట్లుగా తయారయ్యారు. వీరు ప్రదర్శించే నాటకాలు ముఖ్యంగా శశిరేఖా పరిణయం, రెండవది చెంచులక్ష్మి, చుక్కలూరి రామ నాటకం, మర్రిగుంట రామాయణం, వీరి ప్రదర్శనల్లో చెంచులక్ష్మి భాగవతం ప్రతిభావంతంగా ఉంటుంది. ముఖ్యంగా వీరి భాగవతాలు పల్లెల్లో వ్యవసాయతరుణం అయిపోయిన తరువాత, రాత్రి సమయాల్లోనూ దసరా ఉత్సవాల్లోనూ ప్రదర్శిస్తారు.

## వెన్నెల నాటకాలు

పూర్వం ప్రతి వైశాఖ పౌర్ణమికి, ఆరు బయట నిండు వెన్నెలలో రెండు మూడు రోజులు ఈ వెన్నెల నాటకాలు ఆడుతూ ఉండేవారు. వీటిని 'రాసనాటికా' అనేవారు. 1916-17 సంవత్సరాల ప్రాంతంలో బందరులో కొనుకొల్లు నరసింహం గారు బృందావనపురం ప్రాంతంలో ఈ రాసలీలలు ప్రదర్శించటం వల్లనే ఆ ప్రదేశానికి బృందావనపురమని పేరు వచ్చినది. భజనగీతాలమాదిరి భాగవతంలోని భ్రమర గీతాలను పాడేవారు.

ఈ ప్రదర్శనలకు వెన్నెలలో ఇసుక దిబ్బలమీద తులసికొమ్మలు పాతి, ఆ తులసికొమ్మల చాటున, గోపికాలీలలు ప్రదర్శించేవారు. తులసి అంటే బృంద అందుకే వాటిని బృందావనగీతాలనేవారు. ఇందులోని నటీ, నటులు ఆయా కుటుంబాలకు సంబంధించిన బాలబాలికలు, బాలులందరూ కృష్ణులూ, బాలికలందరూ గోపికలూ, అందరూ ఒకేరకమైన రంగుల బట్టలు ధరించేవారు.

# పులి నృత్యం

పులివేషం జంతు నృత్యాలకు అనుకరణ, నెమలి నృత్యం, గరుడ నృత్యం, సింహనృత్యం మాదిరే ఈ పులినృత్యం కూడా మంచి ప్రచారంలో ఉన్న కళారూపం. పులివేషధారణ చాలా కష్టమైనది. మామూలు వేషాల్లాగ ఏదో ముఖానికి ఇంత రంగు పూసి తుడిచివేయడం లాంటిది కాదు. శరీరంలో అన్ని భాగాలనూ వార్నిషు రంగులతో ముంచివేస్తారు. శరీరమంతటా అక్కడక్కడ నల్లటిచారలను చిత్రించడంతో పెద్ద పులి ఆకారం వస్తుంది. నెత్తికిమాత్రం తోలుతో కుట్టబడిన టోపీని తగిలిస్తారు. వేషం పూర్తి అయిన తరువాత ఈ పులివేషం బజారులోకి వస్తుంది. నిజంగా పెద్దపులి వచ్చినట్లే వస్తుంది. హుందా అయిన నడకలతో, గంభీరమయిన చూపులతో అడుగులు వేస్తూ రోడ్డంతా కలియ తిరుగుతారు. ఈ అడుగులకు తగ్గట్టుగా రెండు, మూడు డప్పులు, తాసాలు వాయిస్తూ ఉంటే ప్రతి ప్రేక్షకునికి చిందులు వేయాలనిపిస్తుంది.

పులివేషధారి అప్పడప్పడు చుట్టూ మూగిన పిల్లల్ని భయపెడుతూ ఉంటారు. ముందు మామూలుగా అడుగులు వేస్తాడు. వాయిద్యం ఉధృతంగా సాగిన వెంటనే నృత్యం ఉధృతం చేస్తూ మొగ్గలు వేస్తూ తొడ చరిచి పౌరుషాన్ని నటిస్తాడు. ఈ నృత్యంలోనే పెద్దపులి,



వేటగాడు, రెండు పాత్రలు నటిస్తాయి. వేటగాడు పులిని చంపాలని ప్రయత్నించడంలో నృత్యం ఎంతో ఆకర్షణీయంగా సాగుతుంది. మధ్యమధ్యన వాయిద్యకారులు పులివేషాన్ని కవ్విస్తూ, వివిధ గతుల్లో అడుగులు వేయిస్తూ, వారు కూడా అడుగులు వేస్తూ గుండ్రంగా తిరిగుతూ ప్రేక్షకులను ఆకర్షిస్తారు. పులివేషగాడు రెండుచేతుల్లో రెండు నిమ్మకాయలు పట్టి అప్పుడప్పుడు అతనికి వచ్చే ఆయాసాన్ని ఆపుకోవడానికి నిమ్మకాయలను కొరికి రసం త్రాగుతూ జంతుతత్వాన్ని నటిస్తాడు.

పులివేషం ఆంధ్రదేశపు జానపద నృత్యాల్లో ముఖ్యమైనది.

# కోలాట నృత్యం (జడకోపు)

ఈ కోలాట నృత్యం విజయనగర సామ్రాజ్యంలో ప్రసిద్ధంగా ప్రదర్శించినట్లు విదేశీ యాత్రికుడు అబ్దుల్ రజాక్ వర్ణించారు. ఈనాటికి విజయనగర శిథిల శిల్పాలలో, శ్రీశైలం దేవాలయ ప్రాకారపు గోడలపైన కోలాటం చేసే నర్తకురాండ్ర శిల్పాలున్నాయి. తెలుగుదేశపు జానపద నృత్యాలలో కోలాట నృత్యాన్ని పిల్లలు మొదలు పెద్దల వరకు అందరూ చేస్తూ ఉంటారు. ప్రతి బాలిక నోటితో పాట పాడుతూ చేతి చిరతలతో ఏకకాలంలో తాళం వేస్తూ వివిధ రకాలైన కొప్పలను (అడుగులను) వేస్తూ ఒక ప్రదేశం నుంచి మరో ప్రదేశానికి గుండ్రంగా కదలుతూ ఏకకాలంలో ప్రదర్శన ఇస్తారు. ఇందులో జడకోపు కోలాటం చాలా ప్రజ్ఞతో ప్రదర్శిస్తారు.

సమ సంఖ్యలో అందరూ అన్ని తాళ్లు పట్టుకొని గుండ్రంగా నిలబడతారు. వీరు రెండుపక్షాలుగా చీలిపోతారు. రెండుపక్షాలకు ఇద్దరు నాయకులు ఉంటారు. వారు లయ ప్రకారం రెండు భాగాలుగా విడివడి వారు నిలబడిన కేంద్రం నుంచి మరో కేంద్రానికి ఒకరి తరువాత మరొకరు వరుస క్రమంలో తిరగడంతో ఈ తాళ్లన్నీ అల్లబడిన జడలాగ సుందరంగా కనబడుతుంది. ఈ అల్లికలో ఏ ఒక్కరు తప్పగా నడిచినా జడ చిక్కుపడి పోతుంది. అందువల్ల ప్రతిఒక్కరూ నైపుణ్యతతో నర్తిస్తూ జడను అల్లుతారు.



వీరు ఒకేరంగు గల లంగాలు, చొక్కాలు తొడుగుతారు. రంగు రంగుల కోలాటపు చిరతలు ధరించి వలయాకారంగా తిరుగుతూ ఉంటే ఇంద్రలోకంలో దేవతలు నృత్యం చేస్తున్నారా అని అనిపిస్తుంది. వీరి జడకోపు ప్రదర్శన శాస్త్రయుక్తమైన భరతనాట్యంలో ఒక భాగంగా ఉంటుంది. వీరిలో జట్టు నాయకుడు నిలిచే ప్రదేశాన్ని 'గరిడి' అని అంటారు. ఈ కళాకారులు కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో బ్రహ్మోత్సవాల సమయంలో ఎక్కువగా ప్రదర్శనలు చేసేందుకు ఇష్టపడతారు. కోలాటం కోపులలో దాదాపు 50 రకాలు ఉన్నాయి. ఇందులో ప్రార్థన కోపు, ఉజ్జ తిరుగుడు కోపు, కృష్ణ కోపు, లావి కోపు, చిప్పాట కోపు, దంపుడు కోపు, బసవ కోపు, వంటివి ఎక్కువగా కనిపిస్తాయి. ఒక్కొక్క ప్రాంతాన్ని బట్టి ఇవి మారుతూ ఉంటాయి.



# కొయ్యబొమ్మలు

ఈ బొమ్మలకు 'పాంచాలిక' లనీ, పుత్తళిక' లనీ పేరు కూడా ఉంది. ఇవి కొయ్యబొమ్మలు, నాటకాలన్నింటినీ ఈ పాంచాలికలనే కొయ్యబొమ్మలాటలుగానే ప్రదర్శించారనే ప్రతీక కూడా వుంది. తోలుబొమ్మలకు ముందరి కళారూపం ఈ కొయ్యబొమ్మలే. భాసుని నాటకాలు కొయ్యబొమ్మలలో ప్రదర్శిస్తే భవభూతి నాటకాలన్నీ తోలుబొమ్మలలో ప్రదర్శించబడ్డాయి. సుభటుని దూతాం గద, రాజశేఖరుని బాలరామాయణం మొదలైనవి తోలుబొమ్మల నాటకాలుగానే ప్రదర్శింపబడ్డాయని ప్రతీతి. ఈనాటికీ ఈ బొమ్మలాటలను చూడాలంటే తమిళనాడులో చూడొచ్చు. బొమ్మలాట్టం అని ఈ కళారూపాన్ని అక్కడ అత్యద్భుతంగా ప్రదర్శిస్తున్నారు. ఈ ప్రదర్శనలు కొంతకాలం ఆంధ్రదేశం లోనూ ప్రదర్శింపబడినా, ఇటీవలికాలంలో ఎక్కడా ప్రదర్శించినట్లు లేదు. అందుకు కారణం తోలుబొమ్మలై ఉండవచ్చు. తమిళనాడులో తోలుబొమ్మలకంటే ఈ కొయ్యబొమ్మల ప్రదర్శనలే ఎక్కువ. గంటి భాగవతుల రంగస్థలం వీధి భాగవతుల మాదిరికూడా కాదు. ప్రతి ఇంటి ముందు ప్రదేశమూ వీరికి రంగస్థలమే. చుట్టుప్రక్కల నాలుగు ఇండ్ల ప్రజలే వీరి ప్రేక్షకులు. వీరి ప్రదర్శనకాలం కూడా స్వల్పమే. ఈ బొమ్మలాటల్ని యాచనకే ఎక్కువ ఉపయోగించారు. వారికి ప్రజలిచ్చే పారితోషికం ఎమిటో తెలుసా. బొమ్మలాడించుకునేందుకు వారి దీపపు స్తంభపు ప్రమిదలో ఒక గంటెడు నూనె పోస్తే చాలు. దాని పోషణకు ఆ ప్రమిదలో ఎవరికి తోచిన కానుకలను వారు వదిలేవారు. గంటెడు చమురుతో తృప్తిపడి ప్రదర్శనలను సాగించేవారు కాబట్టి వీరిని గంటిభాగవతులనేవారు.



# తోంగ్‌సేన్ నృత్యం

పండుగల సమయంలో పెళ్లివంటి శుభకార్యాల్లో ఆటపాటలతో తమ ఆనందాన్ని పంచుకునేందుకు, తమ సంస్కృతిని ప్రతిబింభింప జేసేందుకు సంప్రదాయ నృత్యమైన 'తోంగ్‌సేన్‌ను' గిరిజనులు ప్రదర్శిస్తారు. పండించే పంట తొలిముద్దను తినేముందు తమ ఆరాధ్య దేవతలకు మొక్కులు చెల్లించి ఆ పంట పేరుతో పండుగలు జరపడం గిరిజనుల ఆనవాయితీ. కంది కొత్తల పండుగకు మాత్రం కొన్ని గ్రామాల ఆదివాసీలు జట్లుగా విడిపోయి ఆదివాసీల నివాసిత ప్రాంతంలో 'తోంగ్‌సేన్' నృత్యం చేస్తూ కలియ తిరుగుతూ వారి సాంస్కృతిక, జీవన విధానాన్ని గుర్తుచేసుకుంటారు. ఈ పండుగల సమయంలో గొడ్డలమ్మ ఛత్రగడలను పట్టుకుని, డప్పవాయిద్యాలతో, తుడుందెబ్బలతో, నృత్యం చేస్తూ గ్రామాల్లో ఇంటింటికి తిరిగి బియ్యాన్ని సేకరించి, పండుగ చివరి రోజుల్లో ఆయా గ్రామాలవారు వారు పండించే పంటలతో విందుకు ఏర్పాటు చేసుకుంటారు. గిరిజనులు సాధారణంగా జాతర దేవత, డొక్కిదేవత, బాబుంగ్ దేవత, కత్తుపుర్ దేవతలను కొలుస్తుంటారు.

గతంతో పోలిస్తే జీవంతగ్గిన తమ సంప్రదాయ విధానాలకు, కళలకు జీవం పోయాలని కొందరు గిరిజనులు తపన పడుతూ ఆ దిశగా ప్రయత్నం చేస్తున్నారు. ఇందులో భాగంగా గిరిజన గ్రామాల్లో పెళ్లి, పండుగలు, ఖాళీ సమయాల్లో ఇటువంటి ప్రదర్శనలు చేసి సంప్రదాయ విధానాలకు జీవం పోస్తున్నారు. గిరిజనులు ఎక్కువగా మార్చి, జూన్ నెలల్లో పెళ్లిళ్లు జరుపుకొంటారు. వీళ్లు ఎక్కువగా చుక్కముహూర్తం పెట్టుకుంటారు. ఈ సమయంలో పెళ్లికూతురు దగ్గరకు వెళ్లినపుడు అత్తవారింటికి తెచ్చినపుడు ఆటపాటలతో, వారి వాయిద్య పరికరాలతో వెళ్తారు. వ్యవసాయ పనులు, శుభ, అశుభ కార్యక్రమాలు, పుట్టింటికి, మెట్టింటికి వెళ్లడం, బాధ, విచారం, ఆనందం తదితర అన్ని అంశాలకు వేర్వేరు నృత్యరూపకాలు ఆయా సందర్భాలకు జీవం పోసినట్టు ఉండడం పెద్దవిశేషంగా చెప్పవచ్చు.

# ఫకీరు వేషం

సాయిబుల్లోని కొంతమంది గళ్లలుంగీ కట్టుకొని, రకరకాలైన రంగు చొక్కాలను ధరించి, ఒక చేత్తో ఖంజర వాయిస్తూ, ఇంటి ఇంటికి తిరుగుతూ మాటి మాటికి అల్లాను జపిస్తూ, ఖురాన్‌లోని నీతివాక్యాలను ప్రజలముందు ఉంచుతారు. వీరు మెడలో ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ రంగు గల పూసలను వేసుకుంటారు. వీరు ముస్లిం పండుగలకు సంబంధించిన పవిత్ర దినాల్లోనే ఎక్కువగా కనిపిస్తారు. ఈ ఫకీర్లను అనుసరిస్తూనే కూచిపూడి భాగవతులు ఫకీరు వేషం వేసేవారు. బుడిగె జంగాలకు చెందిన పగటివేషగాళ్లు కూడా ఈ వేషాన్ని వేస్తుంటారు. వీరు నిరక్షరాస్యులు. తాతల, తండ్రుల ద్వారా సంక్రమించిన వారసత్వంతో భక్తిగీతాలను నేర్చుకుంటారు. రంజాన్ నెలలో ప్రతిదినమూ వేకువ జామున ముస్లింల ఇండ్లకు వెళ్లి ప్రార్థనా గీతాలతో మేల్కొలుపుతారు. 'ఉరుసు' మొదలగు ఉత్సవాల్లో వీరు మేళా నిర్వహిస్తారు. 'వసీల' అనగా ఖంజర సాయంతో పాటలు పాడతారు. హిందువులు ఎక్కువగా దర్శించే దర్గాల వద్ద తెలుగులో కూడా పాటలు పాడతారు. విజయనగరంలో బాబామెట్టపై గల దర్గావద్ద ఖాదర్‌బాబా ఉత్సవాలలో ఉర్దూ పాటలు పాడతారు.

# బైండ్ల కథ

ఈ కళాకారులు బైండ్ల కులానికి చెందినవారు. కాబట్టి వీరు చెప్పే కథలకు బైండ్ల కథ అని పేరు వచ్చింది. ఆంధ్రప్రాంతంలో "జమడిక" అనే వాద్యాన్ని వాయిస్తూ కథలు చెబుతారు. వీరు జమిడికమీద పాట పాడుతారు. పాటకు శృతి ఉంటుంది జేగంట ఉంటుంది. బృందంలో ముగ్గురు కళాకారులుంటారు. వీరు చెప్పే కథలు బుర్రకథల మాదిరిగా ఉంటాయి. వీరి కథాగానం బాణీలు వీథిభాగోతం బాణీలు మాదిరిగా ఉంటాయి. వీరు ఆంధ్రదేశమంతటా ఉన్నారు.

వీరు గౌడజాతులవారి ఇళ్లలోను, మాలల ఇళ్లలో కొలువులు కొలుస్తారు. వీరు మాదిగల ఇళ్లలో దేవి పూజలు చేస్తారు. పంబ వాద్యంతో వీరు దేవి కథ చెబుతారు. అంకాళమ్మకథ, మారెమ్మ కథ, మాతంగి పుట్టుక, ఎల్లమ్మకథ, మాంధాత కథ, దశ కంఠరాయుని కథ మొదలైన గాథలను గానం చేస్తూ ఉంటారు.

వీరు చెప్పే ఎల్లమ్మ కథే పరశురాముని కథ. తండ్రి ఆజ్ఞ మేరకు తల్లి రేణుకాదేవి తలను పరశురాముడు గొడ్డలితో నరుకుతాడు. తాను చెప్పినట్లు చేసిన కుమారున్ని వరం కోరుకొమ్మనగా తల్లిని బ్రతికించమని కోరుకుంటాడు. గొడ్రాళ్లకు సంతానం కలిగించే దేవతగా ఎల్లమ్మ దేవతను కొలవడం పల్లెలో ఆచారం. కాకతీయుల కాలం నాడే జానపద కళాకారులు ఈ "ఎల్లమ్మ కథ" చెబుతున్నట్లు శ్రీనాథ మహాకవి గ్రామస్తులు రచించిన "క్రీడాభిరామం" అనే గ్రంథంలో ప్రస్తావించబడింది.

వీరు రాయలసీమ ప్రాంతంలో "పెద్దమ్మ" కథ చెబుతున్నట్లు తెలుస్తోంది. కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాల్లో బ్రాహ్మణుల ఇళ్లల్లో బైండ్లవారు "కామేశ్వరి" కథ చెప్పేవారని సమాచారం.

వీరు చెప్పేకథలు తాతల కాలం నుండి అను వంశకంగా ముఖతః వస్తున్నవే కానీ గ్రంథస్థం కాలేదు. ఈ కథలు చెప్పేవారిని దేవుని పూజారులుగా లేదా సేవకులుగా పిలవబడతారు.

# బాలసంతులు

మహాశివుని కీర్తిస్తూ, గ్రామంలో అందరినీ దీవిస్తూ ఇంటింటికీ తిరిగేవారు బాలసంతులు, వీరు బుడిగ జంగం కులములో ఒక తెగవారు.

వాల్మీకి ఆశ్రమంలో సీతమ్మవారు లవకుశలకు జన్మ ఇచ్చినపుడు వారిని చూచుటకు శ్రీరామచంద్రుని తమ్ముడైన శ్రీలక్ష్మణస్వామి వారు బాలసంత వేషధారణలో ఎవ్వరూ గుర్తించకుండా గ్రామములు తిరిగి ధాన్యము, గుడ్డలు బిచ్చమెత్తుకుంటూ చివరకు శ్రీ వాల్మీకి ఆశ్రమం చేరుకుంటారు. శ్రీ లక్ష్మణస్వామి లవకుశలను దీవించి వారికి తాను గ్రామాలలో సేకరించిన బట్టలను ఇస్తారు.

బాల సంతులుకూడా తాము లక్ష్మణస్వామి సాంప్రదాయాన్నే పాటిస్తామని చెబుతారు. అందువలన వారు చంటి పిల్లలను ఆశీర్వదిస్తారు. బాల సంతులు ధోతి, అంగరికి ధరించి విభూది, కుంకుమ నుదుట పెట్టుకొని ఎర్రతలపాక సుట్టుకుని, ఒక కావిడి భుజంపై పెట్టుకొని ఆ కావిడిలో వారు సేకరించిన పాత బట్టలు, బొంతలు పెట్టుకొని గ్రామగ్రామము తిరుగుతారు. ఈ కళాకారులు రాష్ట్రం అంతటా అక్కడక్కడ ఉన్నారు.

బాలసంతుల రాకను గమనించగానే మంచి శకునముగా భావిస్తారు. ముఖ్యంగా వ్యవసాయపనులు మొదలుపెట్టునపుడు వారి రాక వలన తమ పంటలు బాగా పండుతాయని భావిస్తారు. వీరు జేగంట శంకులను పాటలు పాడేటప్పడు ఉపయోగిస్తారు. ప్రతి ఇంటికి తిరిగి బిచ్చ మెత్తుకుంటారు. గర్భిణి స్త్రీలను సుఖ ప్రసవం కావాలని ఆశీర్వదిస్తారు. సంతానం లేని స్త్రీలకు ప్రత్యేకమయిన మందులు ఇస్తారు.

ఈ విధంగా బాలసంతుల రాక గ్రామాలలో పురుషులకు, స్త్రీలకు, చిన్న పిల్లలకు ఎంతో ఆనందదాయకంగా ఉంటుంది.

# విలువిద్య

మన భారతదేశం అనేక కళలకు పుట్టినిల్లు, క్రూరమృగ సంయుతంబు లైన ఘోరారణ్యంబులు మహత్తరమైన నదీనదంబులు, పుణ్యక్షేత్రాలు, ఋషీశ్వ రులూ వేదవేదాంగాలుతో మన భారతదేశం విలసిల్లుచున్నది. మనకి మన ఋషీశ్వరులు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అను నాలుగు వేదాలను వరంగా ప్రసాదించారు. యజుర్వేదమునకు ఉప వేదము ధనుర్వేదము. ఇందుకో విలువిద్యను గురించి మనకు సవివరంగా విశదీక రించబడినది.

పూర్వం ద్రోణాచార్యులు అర్జునునకు ఈ ధనుర్విద్యను నేర్పించి నట్లుగా పురాణాలు తెల్పుతున్నాయి. విలువిద్య అనగానే మనకు శ్రీరాముడు, ద్రోణాచార్యుడు, అర్జునుడు, ఏకలవ్యుడు మొదలగువారు జ్ఞప్తికి వస్తారు. పూర్వకాలంలో రాజులు తమ రాజ్య విస్తారానికి రాజ్యంలో శాంతిభద్రతలు కాపాడటానికి సామాన్య పౌరులు తమ ఆత్మ రక్షణకు ఈ విలువిద్య ఎంతగానో ఉపయోగపడింది. అయితే ప్రస్తుతం ఆధునిక మారణాయుధాల రాకతో ఈ విలువిద్య క్రమేపీ అంతరించిపోయింది.



# స్త్రీల పాటలు

పెళ్లి జరిగినా ఏదైనా శుభకార్యం జరిగినా స్త్రీల పాటలు పాడటం తెలుగువారి ఆనవాయితీ. అట్లాగే తిరగలి తిప్పతూ, రోకలితో దంచుతూ పాటలు పాడటంవల్ల ఆ శ్రమ తెలియకుండా ఉండేందుకు సంతోషంతో స్త్రీలందరూ వారి గృహకార్యాలు ఆడుతూ పాడుతూ చేసుకునేందుకు ఈ పాటలు ఎంతో ఉపయోగపడతాయి. శుభకార్యాలలో స్త్రీలు పాటలు పాడటం తెలుగువారి, సంస్కృతి, సంప్రదాయాలకు గీటురాయి. అలాగే పనిచేసే టప్పడు ఆశ్రమము మర్చిపోవడానికి పాడే పాటలు ప్రాచుర్యాన్ని పొందాయి. వసంతలాడుకుంటూ సరస సల్లాపాలతో పాడే పాటలు మరింత ఉత్సాహాన్నిచ్చి కలగశాన్నే శాసిస్తాయి. ఇంతేకాక ఆ పాటలలోని సాహిత్యం తోటి శ్రోతలను అలరింపచేస్తాయి. ఈ పాటలను శ్రీమతి గిడుగు లలిత గారు వివిధ ప్రదేశాలకు వెళ్లి మరియు పెద్ద వయస్సు వున్న బొమ్మలతో వారు పాడుకునే పాటలను వ్రాసుకొని చాలా పాటలను సేకరించడం జరిగింది.

గ్రామాలలో బామ్మలు ఇప్పటికీ తెల్లవారు జామున లేచి పాటలు పాడు తుంటారు. ఈ తరంవారు ఆ పాటలను వారితో పాడించి రికార్డు చేసికొని ఈ తరం మరియు భావితరం వారికి మన సాంప్రదాయ పాటలను ప్రజలను అందచేస్తున్నారు.

వీరు గొబ్బెమ్మల పాటలు, ఇసుర్రాయి (తిరగలి) పాటలు, లాలిపాటలను సేకరించి శ్రావ్యముగా తమ బృందములలో గానము చేస్తున్నారు. వట్టి పాటలేకాక కోలాటం నృత్యంతో కూడా కలిపి ఈ పాటలకు వన్నె తెస్తున్నారు. ☼

పాటలకు వాద్యాలు

హార్మోనియం - 1, తబలా - 1, మద్దెల - 1, పుల్లగొయ్య-1, ఘటం-1



# ఉరుములు

ఉరుములు ఉదయం దేవస్థానాలలో దేవతలను మేల్కొలుపుటకు ఉపయోగించేటి వాయిద్యం. అందువలన ఈ వాద్యం వాయించెడి వారిని దేవతా ఉరుములు అంటారు. వీరు అనంతపురం జిల్లాలలోను, జిల్లా సరిహద్దులలో గల కర్ణాటక రాష్ట్రంలోని జిల్లాలలోను ఉన్నారు. మన రాష్ట్రంలో ఇప్పటికీ దేవతలను ఆవాహనం చేసేటపుడు ఈ వాద్యాలను ఉపయోగిస్తారు. దీనిని వాయిస్తూ పద్యాలు, శ్లోకాలు కూడా చదువుతుం టాడు. ఇది మృదంగం కన్నా పెద్దది. రెండు ఇత్తడి చట్రాలలో మేక చర్మం గట్టిగా బిగించబడి ఉండుటవల్ల వాయిస్తున్నప్పడు ఉరుముతో పోలిన పెద్ద శబ్దం వస్తుంది. ఈ కళాకారులు మాలకులంలోని ఒక తెగకు చెందినవారు. వీరు జీవన విధానంలో చాలా నియమ నిబంధనలు పాటిస్తారు. మద్యం, మాంసం తీసుకోరు. కాళ్లకు చెప్పలు వేసుకోరు. శుక్రవారం, సోమవారం ఒంటిపూట భోజనం చేయటం, చావింటికి, పురిటింటికి వెళ్లకపోవడం వంటి నిబంధనలను ఇప్పటికీ తూచ తప్పకుండా పాటిస్తున్నారు. ఉదయం లేవగానే ఉరుము వాద్యమును పూజించి గాని వేరొక పని చేపట్టరు. ఉరుము వాయించేటప్పడు ఓంకారనాదం వస్తుంది. ఆ ఓంకారనాదం దేవతలను ఆవాహన చేయుటకు, ఉత్తేజపరచుటకు దోహదపడునని వారి నమ్మకం. ఈ వాద్యాన్ని గుళ్లలోను, దేవతా ఉత్సవాలలోనే కాక, మృగాలను ఈ వాయిద్యంయొక్క శబ్దంతో భయపెట్టి దూరప్రాంతాలకు తరుముటకు ఉపయోగిస్తాయి. వీరు నాగదేవతల కథలు వీరు అంకమ్మ, పోతరాజు, కాటమయ్య మొదలయిన శక్తి దేవుళ్లను, దేవతలను స్తోత్రం చేస్తూ ఉరుము వాద్యంతో పాడుతారు.

ఈ విద్య మౌఖికం ఒకరి నుండి ఇంకొకరికి వంశపారంపర్యంగా చెప్పబడిన విద్యేకానీ గ్రంథస్థం కాబడలేదు. దీనిని 1982లో సాంస్కృతిక శాఖ వారు ఏర్పాటు చేసిన ప్రదర్శనలో శ్రీ ఉరుముల ఓబులేసుచే

ప్రదర్శించ బడుటవల్ల ప్రచారం లభించింది. తర్వాత రామాంజనేయులు, సిద్ధరామాపురం గ్రామం, అనంతపురం జిల్లా వారిచే ప్రదర్శనలు ఇవ్వబడినవి.



# ఆసాది కథ

వర్షాలపై ఆధారపడి పంటలు పండించే రైతులు ముఖ్యంగా చెప్పించుకునే కథ ఆసాది కథ. ఈ కథలు చెప్పేవారు "ఉప్పరి" కులస్తులు, "మాదిగ" కులం వారు కూడా ఈ కథలను చెప్పేవారు. ఆది పురాణంలో కూడా ఈ కథ వుందని చెబుతూ వుంటారు.

ఆసాది ఒక ఇంటి పేరుగా గలవారు ఆటవిక సంప్రదాయాలను పాటిస్తారు, వారు దేవతలకు "కల్లును" నైవేద్యంగా సమర్పిస్తారు. అమ్మవారి ఊరేగింపులలో ఘటం నెత్తిపైన పెట్టుకొని నృత్యం చేస్తూ పూజలు నిర్వహించిన తర్వాత అమ్మవారిని వర్షం కురిపించవలసిందిగా వేడుకొంటారు. అటువంటి సమయాలలో నృత్యంతోపాటుగా కథాపఠనం ఉంటుంది.

దేవతలకు నైవేద్యంగా సమర్పించే కల్లును పూజారే స్వయంగా చెట్టునుండి తీసుకొనివచ్చి నైవేద్యము పెడతారు. నైవేద్యాన్ని పెట్టిన తర్వాత అందరూ ప్రసాదంగా స్వీకరిస్తారు ఆ కల్లును.

వీరు ముఖ్యంగా వర్షం కురిపించుట కొరకు అంకాలమ్మకథ, నల్లమ్మకథ, మారెమ్మ కథలు చెబుతారు. వీరి పిల్లలకు వ్యాధులు రాకుండా పెద్దమ్మ కథ, యల్లమ్మ కథ, గంగమ్మ కథ చెబుతారు. ఇవిగాక పరశు రాముని కథ కూడా చెప్పడంలో సిద్ధహస్తులు. తమ కులం కాపాడుకోవడానికి ప్రాణత్యాగం చేసిన వీరతిమ్మమ్మ కథను వీరమాతగా కీర్తిస్తూ భక్తిభావాలతో కథను రంజింపజేస్తారు.

ఈ బృందాలు అనంతపురం, కడప జిల్లాల్లో వున్నాయి. వడిబియ్యంకటి, పల్లకిపై అమ్మవారిని కూర్చోబెట్టి, మంగళహారతులు ఇచ్చి 5 లేక 10 రోజులు కథలు చెప్పించుకుంటే గ్రామము శాంతి సౌఖ్యాలతో ఉంటుందని ఆనాటి ప్రజల విశ్వాసం.

# శారద కథ

శారద వాద్యం ఇంచుమించు తంబుర వలే ఉన్న ఇది చిన్నని వాద్యం, దీనికి చివర సరస్వతి బొమ్మ ఉండుట వలన శారద అని పేరు వచ్చింది. ఇది కూడా ఇంచుమించు బుర్రకథను పోలివుంటుంది. ఈ వాద్యాన్ని వాయించే వారిని శారదవాళ్లు అని పిలుస్తారు. వీరు ధోవతి, చొక్కా, కోటు ధరించి తలపాగా పెట్టుకొంటారు. వీరు ఎక్కువమంది స్త్రీలను పెండ్లి చేసుకొని వారి భార్యలను సహకళాకారులుగా పెట్టుకుంటారు. రాగానికి ప్రాముఖ్యత లేకుండా కథ చెప్పడం వీరికి మాత్రమే చెల్లింది. కథకు ప్రాముఖ్యత వుండటం వల్ల ప్రేక్షకాదరణ పొందింది. శైవులు, వైష్ణవులు ఐకమత్యంగా ఈ కథ చెప్పడం విశేషం. వీరు శారద వాయిద్యంతో పాటుగా బుర్ర, తాణం వుంటాయి. స్త్రీ బుర్రను వాయిస్తూ సహకారాన్ని అందిస్తుంది. జంగాల కులస్తులు బుడిగి జంగాలు ఈ కథలను ఎక్కువగా చెబుతారు. వీరు సర్వాయిపాపడు కథ, ఆరుగురు మరాలీల కథ ఎక్కువగా చెబుతారు. ఈ సంప్రదాయ కళ వీరికి ముందు తరాల నుండి వచ్చినవే కాని గ్రంథస్తం కాలేదు. కొత్తకాలంలో వీరు కాంబోజిరాజు కథ, సుగుణవతి కథ, సత్యహరిశ్చంద్ర మొదలగు కథలను కూడా చెబుతారు. గ్రామాలలో ఉత్సవాలకు, పండుగలకు ఈ కళారూపం ప్రసిద్ధిగాంచింది.



# పాండవుల కథ

"తోటి" కులానికి చెందిన వారు మాత్రమే నాగొంబా, జల్లిదేవర, భీమదేవర మరియు రేణుకాదేవులను పూజిస్తారు. వీరు దసరా, దీపావళి, సంక్రాంతి పండుగలను చేసుకుంటారు. వీరు గౌండ్స్ జాతి యొక్క ఆచార వ్యవహారాలను పాటిస్తారు. వీరిలో కథకుడు కిన్నెర వాయిస్తూ కథ చెబుతారు. మరొకరు మద్దెల వేరొకరు తాళం సహాయం అందించగా మరొకరు వంతపాటగాడు తన సహకారం అందిస్తాడు.

వీరు మహాభారతంలోని పాండవజననం, శశిరేఖా పరిణయం, ద్రౌపది వస్త్రాపహరణం, కీచకవధ, బకాసురునివధ కుంతీ లగ్నం, సహదేవుని లగ్నం మొదలైన ఘట్టాలను కథలుగా చెబుతారు. ఆంధ్రప్రాంతంలో వివాహ కార్యక్రమాలకు సంబంధించి పందిరిరాట వేయుట, పెళ్లికూతురుని చేయుట, జీలకర్ర, బెల్లం, మూడుముళ్లు బంధం, తలంబ్రాలు, అరుంధతి నక్షత్రం గూర్చి వాటి ప్రత్యేకతను, ప్రాధాన్యతను తెలియజేస్తారు. వీరు తమ కథల్లో భీముని యొక్క కీర్తిని ఉగ్గటిస్తూ చేసే కథాలాపన చక్కగా వుంటుంది.

పంటకోతల సమయంలో నెలపొడుగునా ఉదయం 4.00 గంటలకు ఊళ్లో మేలుకొలుపు పాటలు ముఖ్యంగా "తత్వాలు" పాడేవారు. సంక్రాంతి రోజున అందరి ఇళ్లకు వెళ్లి ధాన్యం సేకరించుకుంటారు.

# రేణుకా యల్లమ్మ కథ

జమదగ్ని మహర్షి రేణుకా దేవిని వివాహం చేసుకొని బదరిక ఆశ్రమానికి వస్తారు. వారు. ఆశ్రమంలో కాపురం చేస్తూ ఉంటారు. వారికి నలుగురు కుమారులు (1) అలరాముడు (2) నీలరాముడు (3) హృదయరాముడు (4) పరశురాముడు. ఒక కుమార్తె నీలగౌరి. జమదగ్ని మహర్షి ఒకరోజున రేణుకాదేవిని నదీ తీరానికి వెళ్లి నీరు తీసుకొనిరమ్మని చెబుతాడు. ఆమె కుండలో నీరు నింపుతుండగా నీటిలో గంధర్వుని చూడడం జరుగుతుంది. అంతట జమదగ్ని మహర్షి దివ్యదృష్టితో విషయాన్ని గ్రహించి "నువ్వు పరపురుషుని చూసినావు" అందువలన ఈ ఆశ్రమానికి రావద్దని వెళ్లకొడతాడు. కొడుకులను పిలిచి మీ తల్లిని చంపండి అని చెప్పగా వారు అంగీకరించి ఆమెను చంపుటకు వెంటపడగా ఆమె హరిజనవాడలో తోలుపెట్టెలో దాక్కుంటుంది. పరశురాముడు చంపబోగా ఆమె తాను పతివ్రతనని, తాను చనిపోగానే గంధర్వుడితల తెగి భూమిమీదపడుతుందని, పరశురాముని చెయ్యి విరిగి క్రిందపడుతుందని చెబుతుంది. ఆమెను చంపగానే ఆ విధంగానే జరుగుతుంది. వెంటనే పరశు రాముడు జమదగ్ని రేణుకాదేవిని పతివ్రతగా గుర్తిస్తారు. ఆమెను బ్రతికిస్తాడు జమదగ్ని. ఆమె ఎల్లమ్మతల్లిగా అవతార మెత్తుతుంది. జమదగ్ని ముని రాజు అవుతాడు. పరశురాముడు పంబలవా డవుతాడు. అప్పటినుండి ఎల్లమ్మ జాతర జరుగుతోంది.

ఈ కళ తాతముత్తాతల నుండి వస్తున్నది. వీరు హరిజన కులస్తులు. వీరా కథాగానం కోసం గ్రామాలను పంచుకుంటారు. మూడు సంవత్సరాల కొకసారి ఆయా గ్రామాలలో హరిజనులవద్దకు వెళ్లి ఈ కథ చెప్పి పారితోషికం తెచ్చుకుంటారు.

# మంద హెచ్చుల గొల్లకథ

యాదవుల చరిత్ర చెబుతూ వారి నుండి పారితోషికం తీసుకొని జీవించేవారిని "మందహెచ్చులు" లేక "మందెచ్చులు"వారని అంటారు. వీరు వంశపారంపర్యంగా గొర్రెలకు, మేకలకు వచ్చే జబ్బులను నయం చేస్తున్నందున వీరిని "మంద గొల్లలు" అని కూడా పిలుస్తారు. గొర్రెల మేకల ఆరోగ్యం పెంపొందించుటకు ప్రార్థన చేయవల్సిందిగా వీరిని పిలుస్తారు. వీరి రాక వలన వారి మందలు పెరుగుతాయని నమ్మకం ఆయా యజమానులకు ఉంది. కాబట్టే వీరికి మందహెచ్చులని పేరు వచ్చింది. యాదవకుల పురుషునికి శారదకుల స్త్రీకి వీరి కుల ప్రథముడు జన్మించాడని, ఆమె గర్భవతి అయినప్పుడు శారదకులంవారు ఆమెను వెలివేసారని ఆ స్త్రీ గొర్రెల మంద మధ్యన ప్రసవిం చిందని, ఆ మురికి ప్రదేశంలోనే అతనిని పెంచిందని గొర్రెల మలమూత్రాల మధ్య పెరిగినవాడు కనుక మందహెచ్చుడు అనే పేరువచ్చిందంటారు. వీరు గంగాలమ్మ, పోలేరమ్మ, యల్లమ్మ దేవతలను భక్తితో కొలుస్తున్నప్పటికీ వైష్ణవ సాంప్రదాయపరులు. స్త్రీలు రామానుజమతాన్ని అనుసరిస్తుంటారు. మట్టితో చెక్కతో చేసిన బొమ్మలను ఒక బల్లపై పేర్చి, ఆయా బొమ్మలను చూపుతూ కాటంరాజు కథను చెబుతారు. వీరు యాదవకులంలోని ప్రముఖుల కథలను మాత్రమే చెబుతారు. ఇందులో కథకుడు ధోతి, తలకు జేబురుమాలను కట్టుకొని, రెండువైపులా వెండితో తాపడం చేసిన కర్ర పట్టుకొని కథ చెబుతాడు. ఇతని చెవికి ప్రోగులు, ముక్కుకు ప్రోగులు మెడలో గొలుసు వుంటుంది. తల పొడవుగా పెంచుకొని ఆడవారివలె జెడ వేసుకొని వుండేవారు. ☼

# అత్తరు సాహెబ్

గ్రామాలలో పండుగలప్పడు అత్తరు సాహెబ్ అత్తర్లు తీసికొనివచ్చి ప్రతి సంవత్సరం వతనుగా కొందరు రైతులకు గ్రామపెద్దలకు అత్తర్, అగరబత్తీలు, సుర్మా ఇవ్వటం, వారికి రకరకాల మాటలు చెప్పి, వారితో ఎక్కువగా అత్తరును కొనిపించడం జరుగుతూ ఉంటుంది. ఇప్పటికీ ముఖ్యంగా సంక్రాంతి పండుగకు పంటలు పండి రైతులకు ఇంటికి ధాన్యం రావటం. వారు కొంత ధాన్యం అమ్మి నగదును ఇంటి ఖర్చుకు, పండుగ ఖర్చుకు ఉంచుకునే విషయం తెలిసినదే. ఆ సంక్రాంతి పండుగ ముందు అత్తరు సాహెబ్ వచ్చి వతనుగా కొందరు గ్రామస్థులకు సంవత్సరానికిగాని ఆరు మాసములకుగాని సరిపడా అత్తరు, సాంబ్రాణి, అగర్‌బత్తీ వగైరా ఇచ్చి వారివద్ద నుండి వాటి ఖరీదు తీసికొనుట ఇప్పటికీ కూడా చాలా గ్రామాలలో జరుగుతుంది. రైతుల తాత, తండ్రి తరములవారిగా అత్తరు సాహెబ్‌లుకూడా తాత, తండ్రి తరములవారు వచ్చి వతనుగా అత్తరు ఇచ్చి వెళతారు. వారి సరుకు ఎక్కువగా అమ్ముడు పోవుటకు రైతునకు ఉల్లాసమయిన మాటలు అనగా ఆ రైతు తండ్రి ఎంతో రసికుడని తన దగ్గర ఎక్కువ మొత్తములో అత్తరు తీసికొనేవాడని తీయని మాటలతో రైతుతో ఎక్కువ సరుకు కొనిపిస్తారు. ఒక విధంగా చెప్పాలంటే హిందువుల పండుగలపుడు ముస్లిములు (సాహెబ్‌లు) వచ్చి అత్తరు అమ్ముకొనటం, ఒకరిమతంపై ఒకరికున్న అభిమానము, సహజీవనం తెలియచేస్తుంది. ఇప్పటికీ పాతతరం అత్తరు సాహెబ్‌లు గ్రామాలకు పండుగలకు వచ్చి అత్తరులు అమ్ముచున్నారు.

ఈ కళారూపానికి వచ్చే ప్రేక్షకులను ఆకట్టుకొనుటకు హాస్యాన్ని ఎక్కువ జోడించటం జరుగుతుంది. చిన్న గడ్డాలు, సన్న మీసాలు, తలకుపాగాలు, గళ్ల లుంగీలు, పొడవాటి చొక్కా వేసుకొని ఎర్ర గుడ్డ పెట్టెలో అత్తరు సీసాలు వేసుకొని వాటిని భుజాన వేసుకొని అత్తరు, సెంట్లు అంటూ కేకలేస్తారు. కళాకారులు ఇద్దరు చాలు, వారు ఆ విధముగా చెబుతారు. ఇది హేరాయిల్, తలకి రాసుకునే ఆమ్లా ఉందిసార్. గంజాం ఆమ్లా దీనికింద బలాదూర్ ఒక్కసారి ఈ ఆమ్ల తలకి రాస్తే మీ తల ఇంకదువ్వేపనిలేద్ సర్కార్. హంతా గుండుహైపోతాది, హేడి తగ్గుతాది, హీట్ పెర్గుతాది. ఈ విధంగా వారి సంభాషణ హాస్యంతో సాగుతుంది.

# కాటికాపరులు

లోహితాసుడు చనిపోయినప్పుడు చంద్రమతిని కాటికాపరిగా ఉన్న ఆమె భర్త సత్యహరిశ్చంద్రుడు కాటిసుంకం కట్టమంటాడు. ఆమె తనవద్ద డబ్బులేదనగా మెడలోని మంగళసూత్రాన్ని తెంపి ఇవ్వమంటాడు. నా పెనిమిటికి తప్ప అన్యులకు కనిపించని మంగళసూత్రాన్ని ఇతనికి కనబడింది కాబట్టి యితనే నా భర్త హరిశ్చంద్రుడని గుర్తించి భార్యా భర్తలిద్దరూ తమకొచ్చిన కష్టాలకు దుఃఖిస్తూ ఉంటారు. అంతట పరమ శివుడు ప్రత్యక్షమై లోహితాసుడిని బ్రతికించి, ఒక ఆడబొమ్మ, మగ బొమ్మలకు ప్రాణంపోసి వారిని కాటికాపరు లుగా ఉండవలసిందిగా ఆదేశిస్తారు. అప్పటినుండి ఈ కాటికాపరుల తెగ ఆవిర్భవించిందని చెప్పబడుతోంది.

వీరు పెద్ద గంట చేతపుచ్చుకొని ఇంటింటికీ వెళ్లి ఇంద్రజాలాలు చేస్తూ అడుక్కుంటారు. ప్రపంచంలో మొట్టమొదటగా హస్తలాఘవం విద్య ప్రదర్శించినవారు కాటికాపరులని ప్రతీతి. ఆ విద్య 2 సంవత్సరాలు సాధన చేస్తే గాని రాదు.

పారితోషికం ఇచ్చేంతవరకు శ్మశానంలో శవాన్ని దహనం చెయ్యనివ్వ కుండా కాటిపై పడుకొంటారు. కాబట్టి వీరికి కాటికాపరులు అని పేరు వచ్చింది. వీరు భిక్షాటన చేసుకొనుటకు ఊళ్లు పంచుకుంటారు. ఒకరు ఇంకొకరి గ్రామానికి వెళ్లినచో పంచాయితీ పెడతారు.

వీరు ఇంటింటికి భిక్షాటనకు వచ్చినప్పుడు ధాన్యం పెట్టిన తర్వాత దీవించి వెళ్లిపోతారు. ఆ ఇంటివారు ఆరోగ్యంగా ఉండాలని "నపీరా" అనే వాద్యాన్ని వాయిస్తారు. అది వాయిస్తే ఆ ఇంటిలో భూత, ప్రేత, పిశాచాలు ఉండవని వారి నమ్మకం.

వీరు భిక్షకు ముదిరాజుల కులస్థుల ఇళ్లకు వెళ్లరు. ఎందుకనగా ముదిరాజులు "పోటపై" వచ్చే అంటే చెట్లపై వచ్చే ఆదాయం (పళ్లు వగైరా)తో బ్రతుకుతారు కాబట్టి వీళ్లకి కాటె, పోటు తేడాలుండుటవల్ల వాళ్ల ఇళ్లకు భిక్షకు వెళ్లరు.

భిక్షాటనకు వెళ్లని రోజులలో ప్లాస్టిక్ సామానులు అమ్ముకొని బ్రతుకుతున్నారు.

ఈ కళాకారులు తూర్పుగోదావరి జిల్లాలో ఎక్కువగా ఉన్నారు.



# వీరబాహు

పురాణ గాథల్లోని కులరాహిత్యం తెలిపే అంశాలను గానం చేస్తూ సాగే వేషం వీరబాహు వేషం.

బొర్రమీసాలు, పంచెకట్టు, తలపాగా, కాలికి కంటె, మెడలో తాయిత్తు, భుజాన గొంగళి, నడుముకు బిగించికట్టిన గుడ్డ, చేతిలో డప్పు ఇదీ వీరబాహూ వేషం.

వశిష్ఠుడు ఊర్వశికి పుట్టెనని, వాల్మీకి బోయవాడని మహనీయుల జన్మ వృత్తాంతాలు తెలుపుతూ నీతిబోధ, ధర్మబోధలతో సాగే పాటలు పాడుతూ లయబద్ధంగా డప్పు వాయిస్తూ చిందులు వేస్తాడు.

ప్రతి కళారూపంవల్ల సంఘానికి ఒక ఉపయోగమున్నట్టే, ఈ కళారూపం యిచ్చే సందేశం సమాజాన్ని కులవ్యవస్థతో వేరు చేయవద్దని, మనుషులలో ఉన్నవి రెండే కులాలని అవి (1) ఉన్నవారు (2) లేనివారు ఈ విషయం తెలుసుకొని మసలుకోండని డప్పు వాయిద్యానికి అనుగుణంగా, లయబద్ధంగా పాటలు పాడతాడు.

ఎవరిది ఎక్కువ కులము, ఎవరిది తక్కువ కులము మన పూర్వీకుల కాలంలోనే మన ముందున్న కులాలు లేవు, మహాముని వశిష్టుండే మాలకన్యని పెండ్లియాడేరా.. అని డప్పు వాయిస్తూ చిందులు వేస్తూ తమ కళారూపాన్ని ప్రదర్శిస్తారు.

అన్ని జానపద కళారూపాలకన్నా, వీర బాహు ప్రదర్శన విశిష్టత సంతరించుకుంది. సమాజాన్ని తట్టి లేపి, ఆలోచింపజేస్తూ కర్తవ్యాన్ని బోధిస్తున్న ఈ కళారూపం చిరాయువుతో వర్ధిల్లాలని ఆకాంక్షిద్దాం.

# హనుమాన్

హనుమాన్ అనగానే రామభక్తుడని అలాగే చూచిరమ్మంటే కాల్చివచ్చే వారని మనకు స్ఫురణకు వస్తుంది. ఈ వేషం ప్రత్యేకంగా హనుమానుని చిలిపి చేష్టలను చూపిస్తూ ప్రేక్షకులను ముఖ్యంగా పిల్లలను ఆనందింపచేయు వేషంగా రూపొందించబడింది. నిమ్మకాయను మ్రింగి మరల బయటకు తెప్పించుట ఇటువంటి ప్రదర్శనలతో ఈ వేషం సాగుతుంది. ఈ ప్రదర్శనకు వచ్చే ప్రేక్షకులను ఆకట్టుకొనుటం, వారిని ఆనందింపచేయటం, ఈ వేషం యొక్క ముఖ్యోద్దేశము. ఒక గోడపై నుండి ఇంకొక గోడపైకి దూకుతూ మర్కట చేష్టలను చేస్తారు.

పైన చెప్పినవే కాక కష్టమైన ప్రదర్శనలు కూడా చేస్తారు. కొబ్బరికాయను తన నెత్తిమీద పగలకొట్టటం. ఇది ఎంతో కష్టంతో కూడిన పని. చిన్నతనం నుండి అభ్యాసం చేసిన కానీ అలవడదు.

విజయవాడకు చెందిన కృష్ణ అను కళాకారుడు శ్రీ హనుమాన్ వేషములతో జానపద కళారూపాల ప్రదర్శనలకొచ్చు ప్రేక్షకులను ఎంతో అలరిస్తున్నాడు.

ఈ వేషం ప్రేక్షకులకు మరియు టి.వి. దినపత్రికలవారి ఆదరణ పొందుతున్నది.



# నామాల సింగడు

సింగడు ఒక పెద గజదొంగ. నామాలు అనేది అతనుండే గ్రామము పేరు. అందువలన అతనికి నామాలసింగడు అనే పేరు వచ్చింది. రాయలసీమలో కదిరి నుండి పులివెందులకు వెళ్లే మార్గంలో ఒక కనుమ వద్ద నామాలగుండు ఉన్నది. ఆ గుండు దగ్గర నుండి రెండు కిలోమీటర్లు నడిచివెళితే సింగడి స్థావరం వస్తుంది. సింగడు రోజుకు ఒక గ్రామము కొల్లగొట్టేవాడు. కొల్లగొట్టి వచ్చిన తరువాత గుర్తుగా ప్రతిసారీ కొండ ప్రక్కన ఉన్న గుండుమీద ఒక నామము పెట్టేవాడు. అందువలన ఆ గ్రామానికి నామాలగుండు అను పేరు వచ్చింది. ఇతను, ఇతని అనుచరులు పెద్ద పెద్ద బండలను పైకి ఎత్తడంలో నేర్పరులు. ఇతని వద్ద రెండు పిడిబాకులు ఉండేవి. అవి అతని దగ్గర ఉన్నంతవరకు ఎవ్వరూ అతనిని ఏమి చేయలేరు. ప్రభుత్వం సింగడిని ఎలా అయినా పట్టుకోవాలని గుండు ఎత్తే పందేలను కనుక క్రింద కొట్టాల గ్రామంలో ఏర్పాటుచేశారు. సింగడి అనుచరులు ఆ పోటీలో పాల్గొంటారు. కానీ వారు ఆ గుండును మోకాళ్ల వరకు ఎత్తగలరు. అప్పటిదాకా ప్రేక్షకులలో ఉన్న సింగడు ముందుకొచ్చి తన అనుచరులను గుండు ఎత్తనందుకు తిడతాడు. ఆవేశంలో తన వద్ద నున్న రెండు పిడి బాకులను ఇతర ఆయుధాలను తన అనుచరులకు ఇచ్చి తానే గుండును పైకిఎత్తి చుట్టు త్రిప్పతాడు. గ్రామస్తులు అతనినే సింగడుగా గమనించి వెంటనే అతన్ని పట్టుకొని రెండు చేతులను తాళ్లతో బంధించి అతనిని తిరుపతిలో ఉన్న ఠాణాకు తీసుకువెళతారు. సింగడిని జనం పెడరెక్కలు వంచి తీసుకొనివెళుతున్నప్పడు బంధవిముక్తి కోసం చేయు హావభావాలే నామాల సింగడి జానపదరూపంలో ముఖ్యంగా ప్రదర్శించేవి. సింగడి వేషధారుడిని మంచి బలిష్టమైన మనిషిని చూసి ఎంచుకుంటారు. అతని రెండుచేతులలో రెండు పిడిబాకులు ఉంటాయి. సింగడి వేషధారి తలకు గుడ్డకట్టి అందులో కిరీటం వలే వేపకొమ్మలను అమరుస్తారు. నుదుట నామాలు ఉంటాయి. డప్పుల వాయిద్య సహకారంతో ఇద్దరు మనుషులు లాగుతుంటే సింగడు లయబద్ధంగా నృత్యం చేస్తూ వస్తుంటాడు. రాయల సీమ ప్రాంతంలో ఈ కళారూపానికి ఎంతో ప్రాముఖ్యత, ఆదరణ ఉంది. ఉగాది, పీర్ల పండుగ రోజులలో ఈ ప్రదర్శనలు ఎక్కువగా కనిపిస్తాయి.

# వీరముష్టి

పేరులో ఉన్నట్లుగా ధైర్య సాహసాలు ప్రదర్శిస్తూ శారీరకమైన విన్యాసాలు చేస్తూ, జీవనం సాగించేవారు వీరముష్టివారు. వీరు కత్తిసాము, కర్రసాములను, డప్పు వీరణము వాయిద్యములతో ప్రదర్శిస్తూ ఉంటారు. బల్లాలను శరీరక భాగాల్లోకి గ్రుచ్చుకొని భయంకరమైన ప్రదర్శనలిస్తూ ఉంటారు. తలమీద, పొట్టమీద కొబ్బరికాయలు, అరటిపళ్లు పెట్టుకొని కత్తితో చీల్చటం వంటి విన్యాసములు చేస్తూ ఉంటారు. వీరు కన్యక కథను చెబుతుంటారు. కన్యక కథకు సంబంధించి వీర ముష్టివారి గురించి ఒక కథ ఉంది. ఆ కథ.

కన్యక వైశ్యకులములో శ్రీ కుసుమ శ్రేష్టి, శ్రీమతి కుసుమ బాయిలకు జన్మించినది. ఆ దేశరాజైన విష్ణువర్ధనుడు కన్యకను చూసి ఆమెను వివాహమాడాలని నిర్ణయించుకుంటాడు. రాజు స్త్రీలోలుడగుటవల్ల కన్యక తల్లి తండ్రులు, వైశ్య కులము వారు ఆ పెళ్లికి ఒప్పకొనరు. ఈ విషయము తెలిసిన రాజు కన్యక తల్లి తండ్రిని వైశ్యకులమువారిని తన వివాహమునకు ఒప్పకొననిచో, విపరీత పరిణామాలు ఉండునని హెచ్చరించి కన్యకను బలవంతముగా వివాహమాడటానికి బయలుదేరుతాడు. ఈ విషయము తెలిసి వీరముష్టివారు రాజుకు ఇష్టమయిన ముష్టియుద్ధములను అడుగు అడుగునా రాజువచ్చే త్రోవలో ఏర్పాటు చేసి రాజురాకను జాప్యం చేయగలుగుతారు. ఈలోగా అగ్నిగుండం పేర్చుకొని కన్యక ఆత్మాహుతి చేసుకుంటుంది. ఆమె చనిపోతూ రాజురాకను ఆలస్యము చేసి తన కుటుంబము మరియు కులమువారి గౌరవము కాపాడినందుకుగాను వైశ్యులకు వీరముష్టివారితో తమ గోత్రములు చెప్పించుకొని వారికి పారితోషికములు ఇవ్వవలసినదిగా ఆ కన్యక ఆదేశించుట జరిగినది.

వీరముష్టివారు ఇప్పటికి కూడా అమ్మ ఆదేశానుసారము వైశ్యుల పెళ్లిళ్లకు ఇతర కుల సాంప్రదాయ కార్యక్రమములకు హాజరై వారి గోత్రాలు

చెప్పి పారితోషికము తీసుకుంటారు. కన్యక అమ్మవారు పెనుగొండ (పశ్చిమ గోదావరి జిల్లాలోని మండల కేంద్రము)లో వెలసియున్నారు. అన్ని కులములవారు అమ్మవారిని ఎల్లప్పడు భక్తి శ్రద్ధలతో కొలుస్తారు. వీరముష్టివారు దుస్తులు ధరించి ఘంట, శంఖము, కాళ్లకు గజ్జెలు కట్టుకొని కన్యక కథను చెబుతారు. జంగంవారివలె విభూది ధరించి శివుని రూపమైన లింగకాయమును, రుద్రాక్షలను మెడలో మాలవలె ధరించి, గంట లయబద్ధముగా వాయిస్తూ కథ చెబుతారు. కథ చెప్పినపుడు వీరరసము ప్రదర్శించునపుడు శంఖము పూరిస్తారు. తూర్పు గోదావరి జిల్లాలో వీరముష్టి కళాకారులకు సంబంధించి ప్రస్తుతం 100 కుటుంబాలు ఉన్నాయి. విశాఖపట్టణం, విజయనగరం, కృష్ణ, గుంటూరు, పశ్చిమ గోదావరి, ప్రకాశం జిల్లాల్లో కూడా వీరముష్టివారు ఉన్నారు.

# మరగాళ్ళ నృత్యం

చెక్క క్రింది కాళ్ళకు బిగించుకొని చేసే నృత్యమే మరగాళ్ల లేక మరకాళ్ల నృత్యం ఈ నృత్యంలో నలుగురు  కళాకారులుంటారు, నలుగురు డప్పు వాయిస్తూ ఉంటారు. డప్పు వాయిద్యానికి అనుగుణంగా కళాకారులు నృత్యం చేస్తూ ఉంటారు.

పూర్వం పీర్లపండగలప్పుడు చేసే ప్రదర్శనలు ఇంకా విస్తృతపరచి ఈ నృత్యాన్ని రూపొందించటం జరిగింది. ఏమాత్రం కాలు జారినా కళాకారుడు పడిపోయి నడుము విరిగే ప్రమాదం ఉంది. అందుకని ఈ కళాకారులు నునుపుగా ఉన్న ఉపరితలంపై కాకుండా నేలమీద ఈ కళ ప్రదర్శించుటకు  ఇష్టపడతారు.

ఈ నృత్యం చేస్తూ కళాకారులు క్రింద పడవేసిన 10 రూపాయల నోటును మరియు గుడ్డను తీసికొనుట ఒక ప్రత్యేకాకర్షణ. ఈ నృత్యం కళాకారు లందరూ బోయివాల్మీకి కులానికి చెందినవారు. దేవతా ఉత్సవాల



సమయాలలో పీర్లపండుగల సమయంలో ప్రచారమప్పడు ప్రభుత్వం ఏర్పాటుచేసే అభివృద్ధి కార్యక్రమాలకు గ్రామాలలో, పట్టణాలలో ఈ నృత్యం చేస్తారు. ఈ కళ అనంతపురం జిల్లాలో ప్రచారంలో ఉంది. ప్రస్తుతం ఈ ప్రదర్శనలకు ప్రోత్సాహం లేకపోవడం వల్ల వీరు కూలీ చేసుకొనుచున్నారు.

తాతలనుండి వస్తున్న ఈ కళను శ్రీ రాజప్ప ప్రదర్శిస్తున్నారు. వీరిది ధర్మవరం గ్రామం, పందిరిపల్లి మండలం, ఈ నృత్యం ప్రదర్శించువారు అనంతపురం జిల్లా, ధర్మవరం బత్తాలపల్లె మండలాల్లోని సుబ్బారావు పేట, అప్పరాజచెరువు గ్రామాల్లో ఉన్నారు.

చిత్తూరు జిల్లాలోని కొన్ని ప్రాంతాల్లో కూడా ఈ కళ మంచి ప్రాచుర్యం పొంది ఆదరణతో ఉంది.

# కుంచెల నృత్యం

ఆకాశంలో ఉరుము ఉరుముతుంది. మెరుపు మెరుస్తుంది. నెమలి నృత్యం చేస్తుంది. దానికి అనుగుణంగా జానపదులు ఉరుం వాయిద్యం తయారు చేసుకొని, నెమలి ఈకలతో కుంచలు తయారుచేసి నృత్యం ప్రదర్శిస్తారు. ఈ నృత్యం పేరే కుంచల నృత్యం. తొలి ఏకాదశి పండుగరోజున తప్పనిసరిగా వర్షం రావడం కోసం ఈ నృత్యం చేస్తారు.

అనంతపురం జిల్లా ప్రత్యేక జానపద చర్మవాయిద్యం ఉరుము, ఉరుములను వాయించేవాళ్లని ఉరుములోళ్లు అంటారు. వారు మాల కులంలో ఒక తెగవారు. వారు ఎంతో నియమనిష్టలు పాటిస్తారు. చెప్పలు వేసుకోరు. మాంసం, మద్యం ముట్టరు. ఇంకా ఎన్నో నియమాలు పాటిస్తారు. అందువలన వారిని ప్రత్యేకంగా అందరూ గౌరవిస్తారు. వారు ఉరుములు వాయిస్తుండగా కుంచెల నృత్యం చేస్తారు.

ఈ నృత్యం అనంతపురం జిల్లాలో ప్రచారంలో ఉంది. ☼

# బీరప్పడోళ్ళు

డోలాసురుడనే రాక్షసుడిని పరమశివుడు చంపినపుడు, డోలాసురుడు చనిపోతూ తనపేరు చిరస్థాయిగా ఉండేవిధంగా చేయమని ప్రార్థిస్తాడు. అందువల్ల శివుడు డోలాసురుని చర్మాన్ని డోలుగా ఉపయోగ పడునని ఆ డోలు వాయిద్య సహకారంతో దేవునిపై కథలు చెప్పతాయని వరమిస్తాడు. అవే బీరప్పడోళ్ళు అని ప్రసిద్ధి పొందినవి. ఈ బీరప్పడోళ్ల కళారూపాన్ని ప్రదర్శించేవారు కురమ కులస్థులు. వీరు  బీరప్పడోళ్ల వాయిద్య సహకారంతో మల్లన్న బీరన్న, మల్లయ్య, గొల్లమల్లయ్య మరియు కాటమయ్య కథలను దేవుని ఉత్సవాలకు చెబుతుంటారు. కాటమేశ్వరుని జాతర శివరాత్రి అయిన తర్వాత పున్నమికి చేస్తారు.

ఈ జానపద కళారూపాన్ని ప్రదర్శించే కురుమ కులస్థులు, కార్యక్రమాలు లేని రోజులలో గొర్రె రోమాలతో కంబళ్లు అల్లుతుంటారు. ఈ జానపద కళారూపంలో తొమ్మిది మంది కళాకారులు ఉంటారు. వీరు పచ్చ చొక్కాలు, ఎర్రచొక్కాలు, ధరించి పంచెలు కడతారు. ప్రక్కవాయిద్యాలుగా (1) గజ్జెలు, (2) ఫ్లూటు (3) తాళం. కాళ్లకు గజ్జెలు కట్టి తలకు ఎర్రపాగా కట్టుకుంటారు. మరియు ప్రతి ఒక్కరు డోలును మెడకు కట్టుకొని వాయిస్తూ ఉంటారు. వీరు డోళ్లు వాయిస్తూ పోట్లాడుకుంటూ నృత్యం చేయటం ఒక ప్రత్యేక ఆకర్షణ.

దేవుని గుళ్లలో ఉత్సవాలకు, అమ్మవారి జాతరలకు కురమ కులస్థుల ఇళ్లల్లో పెళ్లిళ్లకు వీరు ఈ కళారూపాన్ని ప్రదర్శిస్తూ ఉంటారు. వీరు అనంతపురం జిల్లాలో ఎక్కువగా ఉన్నారు.



# కీలుగుర్రం

వెదురు బద్దలను చీల్చి గుర్రాలుగా తయారు చేసి మధ్యలో ఖాళీ అట్టిపెడతారు. ఖాళీగా ఉన్న ప్రదేశంలో మనిషి నడుంకు కట్టుకుని తప్పెట్ల శబ్దానికి అడుగులు వేసి నృత్యం చేస్తూ ఉంటారు. నర్తకుడిని రాజులాగా అలంకరిస్తారు. గుర్రానికి పైన కూడా అందమైన దుస్తులతో అలంకరిస్తారు. ఈ కళ తరతరాలుగా వస్తున్న కళ. ఈ కళను జాతరులు, ఊరేగింపులు, పెళ్లిళ్లు, పీర్ల పండుగలకు ప్రదర్శిస్తూ ఉంటారు. అనంతపురం జిల్లాలో ఈ కళ ప్రచారంలో ఉంది.

బృందానికి 10 గుర్రాలు, 10 డప్పులుంటాయి.

అనంతపురం జిల్లాలో సుబ్బారావుపేట, అప్పరాజ చెరువు గ్రామాలలో మాత్రమే కీలు గుర్రం బృందాలు ఉన్నవి.

సుబ్బారావు పేటలో 15 బృందాలు

అప్పరాజచెరువులో 10 బృందాలు

ఈ బృందాలలో అన్ని కులాలవారూ ఉన్నారు.



# వీరనాట్యం

దక్ష యజ్ఞమప్పుడు దక్షుడు తన కుమార్తె అయిన సతీదేవిని అల్లుడయిన పరమేశ్వరులను ఆహ్వానించలేదు. ఈశ్వరుని భార్య సతీదేవిని పిలవని పేరంటానికి వెళ్లవద్దని భర్త వారించినా తండ్రిచేసే యజ్ఞానికి వెళుతుంది. అక్కడ దక్షుడు సతీదేవి ఎదురుగా ఈశ్వరుని అవమానంగా మాట్లాడుతాడు. ఆ అవమానం తట్టుకొనలేక ఆవిడ అక్కడే అగ్ని పేర్చుకొని ఆహుతి అయిపోతుంది. ఈ విషయం ఈశ్వరుడు తెలుసుకొని కోపోద్రేక్తుడై తన ఝుటాఝూటాన్ని నేలకేసికొట్టి వీరభద్రుడిని సృష్టించి "వీరభద్రా నీ తల్లిని అవమానపరచినవాని తలను నరికిరమ్ము" అని ఆదేశిస్తాడు. శివుని ఆదేశం మేరకు దక్ష సంహారం చేయటానికి వీరభద్రస్వామి నాట్యం చేస్తూ బయలుదేరుతాడు. సంహారానికి వెళ్ళేటప్పుడు తనవెంట వీరకుమారులు వీరనాట్యం చేస్తూ వెళ్ళి ఆ దక్షుణ్ణి సంహరించి తిరిగివచ్చి ఈశ్వరుడికి దక్ష సంహారం జరిగినట్లు తెలియపరుస్తాడు. ఆ వీరకుమారులు చేసిన నాట్యమే వీరనాట్యం.

వీరావేశంతో చేసే నాట్యకళారూపమే వీరనాట్యం. వీర శైవానికి సంబంధించిన అన్ని జానపదకళారూపాలలో కల్లా ఈ వీరనాట్యం చాలా కష్టతరమైన కళారూపం. శివతాండవం నృత్యంలోని 108 కరణాలు ఇందులో ఉన్నవి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వీరశైవం వ్యాప్తి చెందిఉన్న జిల్లాలన్నిటిలోనూ వీరనాట్యం ఉండుటం గమనించవచ్చు. ముఖ్యంగా తూర్పుగోదావరి జిల్లా, పశ్చిమ గోదావరి జిల్లా, కర్నూలు, అనంతపురం జిల్లాలు వీరనాట్యానికి మంచి ప్రచారంలో ఉన్నది. శివరాత్రి రోజున లింగోద్భవ సమయంలో వీరు "ఊర్ధ్వ తాండవం చేస్తారు.. నాలుకకు శూలాన్ని గుచ్చుకొని శూలానికి నూనెవత్తులు వెలిగించి వాద్యాలకనుగుణంగా వీరావేశంతో నాట్యం చేస్తారు. ఈ నాట్యంలో వీర రసానికి ఎక్కువ ప్రాధాన్యతుంది. ఇటువంటి వీరులు ఉన్న దేశమే శత్రు దేశాలనుండి సంరక్షించుకొనుటకు కావలసిన శక్తికలది అయి ఉంటుంది. వీరనాట్యం మనిషిలోని శౌర్యాన్ని పెంపొందించుటకు తద్వారా దేశ ప్రజలలో దేశభక్తి, పౌరుషం పెంపొందించుకొనుటకు ఎంతో ఉపయోగపడుతుంది.

తూర్పుగోదావరి జిల్లా ద్రాక్షారామంలో పూర్వం దక్షుడు చేసిన యజ్ఞగుండం ఇప్పటికీ ఉంది. ఇప్పటికీ యాత్రికులు చూస్తూ ఉంటారు. పూర్వము వీరముష్టి అనే కులానికి చెందినవారు ఈ నాట్యం చేసేవారు. దరిమిలా దేవాంగుల కులంవారు నేర్చుకొని చేస్తున్నారు. ప్రస్తుతము వీరముష్టి దేవాంగుల కులం వారు ఈ నాట్యాన్ని చేస్తున్నారు.

వీర నాట్యంలో ఈ క్రింది దండకాలు ఉంటాయి.

1. దక్షయజ్ఞం

2. శరభావతారం

3. శ్రీ వీరభద్ర దండకం

4. శ్రీ వీరకుమార దండకం

వాయిద్యాలు

డోలు, సన్నాయి, తాషా, వీరంగం, తంబుర మొదలగు వాద్యాలతో 15 మంది నాట్యం చేస్తారు. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలో సుమారు 8 వీర నాట్యం బృందాలు ఉన్నవి. వీరిని శివరాత్రి సందర్భంగా, కార్తీకమాసం, మాఘమాసం, పెళ్ళిళ్ళకు ముందు దేవునికి బోనం పోసేటప్పుడు పిలుస్తారు. వీరి ప్రదర్శన ఆరుగంటల సేపు ఉంటుంది. ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 200 మంది కుటుంబాలు ఈ కళపై ఆధారపడి ఉన్నాయి. ☼



# తోలుబొమ్మలాట

తోలుబొమ్మలాట అతి ప్రాచీన కళల్లో ఒకటి. ఆది మానవులు కొండ గుహల్లో కొవ్వు దీపాల వెలుగులో రాతి గోడల మీద నీడలు పడేలా చేసి కథలు అల్లినపుడే పుట్టింది ఈ కళ. ఈ కళారూపం మరాఠీ ప్రాంతంలో పుట్టినా తెలుగుప్రదేశాల్లో బహుళ ప్రాచుర్యానికి నోచుకుంది. ఈనాటికి అనేక రూపాంతరాలు చెంది ఇటీవల టి.వి.లలో ప్రచారమవుతున్న పంచతంత్ర మొదలగు కథలుగా రూపాంతరం చెందింది. తోలుబొమ్మలాట ఆంధ్రుల ఖ్యాతిని ఖండ ఖండాలకు వ్యాపింపజేసింది. ఒకనాటి నిరక్షరాశ్యులైన జానపదులను అలరించి ఆదరణ చూరగొన్న కళారూపాల్లో ఇది ఒకటి. అందుకే "తొంబై ఆమడలు పోయి తొలుబొమ్మలాట చూడాలి" అను నానుడి ప్రజల్లో స్థిరపడిపోయింది. తోలుబొమ్మలను మేకచర్మంతో, జింక, దుప్పి చర్మంతో తయారుచేస్తారు. రాముడు, సీత, ఆంజనేయుడు మొదలగు పాత్రలకు జింక చర్మాన్ని ఉపయోగించి మిగతా పాత్రలకు మేకచర్మాన్ని వాడతారు. ప్రధానపాత్రలకు నున్నితమైన చర్మం వాడతారు. ఈ తోలుబొమ్మలాటను "చర్మనాటకం" అని కూడా పిలుస్తారు. తోలుబొమ్మల్ని ఆడించడానికి వీలుగా ఎదురుబద్దను బొమ్మకు మధ్యభాగంలో కడతారు. బొమ్మలను ఆడించాలంటే ఈ బద్దే ఆధారం. వీరికి హార్మోనియం శృతిగా ఉంటుంది. తాళాలుంటాయి. మద్దెలను వాయించే వ్యక్తులు కూడా వంత పాడుతుంటారు.

ఈ ప్రదర్శనలో హాస్యం ప్రత్యేకస్థానం సంపాదించుకుంది. జుట్టుపోలిగాడు, బంగారక్క, అల్లాటప్పడు ప్రేక్షకులను కడుపుబ్బా నవ్విస్తూ కథాగమనానికి నాంది ప్రస్థావనలై నాటక లక్షణాలకు ప్రాణం పోస్తారు.

రథాలు, గుర్రాలు పరుగులెత్తే సమయంలో చెక్కలు టక టకా తొక్కుతారు. భలే రసోత్తరంగా ఉంటుంది. బొమ్మలాటకు సూత్రధారుడు

బ్రహ్మవంటివాడు. కొన్ని శ్లోకాలను చదివి దాని అర్థాన్ని తెలుగులో అర్థమయ్యేలా చెప్పే గేయాలు అతి మధురంగా పై శృతిలో ఆలపిస్తారు. నిజంగా తోలుబొమ్మలాట కళాకారులకు రాని మహాభారతం గాని, రామాయణం గాని లేదంటే అతిశయోక్తి కాదు. వీరు వాల్మీకి రామాయణం, భాస్కర రామాయణం, మొల్ల రామాయణం, మహాభారతాలు చదివి అందులోని పదఘట్టాలను, పద్యాలను ప్రజలకు వినిపిస్తారు. ఈ కళ ప్రాచీన ఓడరేవులైన కళింగపట్నం, భీమునిపట్నం, మచిలీపట్నం నుండి విదేశాలకు భారతీయులతో పాటు వెళ్లిపోయాయి. టర్కీ, గ్రీకు, ఇటలీ, ఫ్రాన్స్ దేశాలకు వ్యాపించాయి. ఇవి ఆయా దేశాల్లో భిన్నరూపాలు ధరించినప్పటికీ భారతదేశం వీటికి మాతృక అని చెప్పవచ్చు.



# రుంజ వాయిద్యం

తెలుగు కులాలలోని కొన్ని కులాలకు ఆశ్రిత (కులాలు) జాతులు ఉన్నాయి. వీరినే పరిశోధకుడు, జానపదవృత్తి గాయకులు అని వ్యవహరిస్తున్నారు. వీరిలో భట్టులు, భట్రాజులు, విప్ర వినోదులు, పిచ్చుకుంట్లు, రుంజలు, పొడపోతలవారు, మాల మాష్టివారు మొదలగు కులాలు వారున్నారు. వీరు ఆయా దాతృకులాల వారిని ఆశ్రయించి గోత్రాలు పొగడి వారి వంశ చరిత్రలు పాడి జీవనోపాధి పొందేవారు. ఉదా. బ్రాహ్మణులకు విప్రవినోది, వైశ్య (కోమటి) లకు వీరముష్టి, గొల్లలకు పొడపోతలు లేదా మందెచ్చులు వారు. మాల కులస్తులకు మాల మాష్టి మొదలగు వారున్నారు. అలాగే విశ్వ బ్రాహ్మణుల (కంసాలీలు) గోత్రాలను వంశనామాలను పొగడి విశ్వకర్మ పురాణం చెప్పేవారే రుంజలు. వారు కథ చెబుతూవాయించే వాయిద్యమే రుంజ. చర్మ వాయిద్యాలలో చాలా పెద్దది రుంజ. దీని శబ్దం కూడా రెండు, మూడు కిలో మీటర్లు వరకు వినిపిస్తుంది. వృత్తి గాయకుల వాయిద్యాలలో ఇంత పెద్దది మరొకటి లేదు. రుంజకారుడు మోయలేని బరువుగానే దీనిని మోస్తుంటారు. "నా సంసార బరువును అది మోస్తున్నపుడు దీని బరువును మేము మోయాలని" ఆ కళాకారులంటారు.

విశ్వ బ్రాహ్మణ కులాలను ఆశ్రయించేవారు రుంజలు, పనసలు, కోమటి పనసలు. అయితే పనసలు వాయిద్యం లేకుండానే కేవలం కథాగానం చేస్తారు. రుంజ కథకులు గ్రామానికి వెళ్ళినపుడు ఊరిలో పెద్ద ఆచారి అంటే మను బ్రహ్మ సంతతివారు ఇంటికి వెళ్లి లేక ఆ ఊరిలో మొదటిగా వచ్చి స్థిరపడిన ఆచారి ఇంటికి వచ్చి కథ చెబుతారు. కొన్ని సందర్భాలలో గ్రామంలోని విశ్వబ్రాహ్మణుల అందరికీ కలిసి ఒకచోట కథ చెప్పడం, కొన్ని సందర్భాలలో పెద్ద ఆచారి ఇంట్లో కథ చెబితే మిగతావారు

అక్కడకు చేరుకొని కథ విని పారితోషికాలు ఇస్తారు. రుంజ కథకుడు కథను ప్రారంభించే ముందు ఏ ఇంటి ముందు కథ చెబుతున్నాడో ఆ గృహస్థుని గోత్రం చెప్పి అతని వంశం చెప్పి అతని కుటుంబం ఇంకా వృద్ధి కావాలని దీవించి తర్వాత విశ్వ బ్రాహ్మణుల వంశ గమనాన్ని, పంచ బ్రహ్మల జన్మ ప్రకారాలను వివరిస్తాడు. ఆ తర్వాతే ఏ కథ అయినా, వీరికి ఇచ్చే పారితోషికం నికరం ఉండదు. అయితే ఏదాత కూడా వీరిని తక్కువ చేసి పంపించడు. డబ్బులు, భోజనం, బట్టలు కూడా పెడతారు. ఈ విధంగా ఒక అలిఖితమైన, అవగాహన, ఆచారం, సంబంధం, ఆశ్రితులైన రుంజలకు, దాతలైన విశ్వ బ్రాహ్మణులకు మధ్య ఎన్నో తరాలుగా కొనసాగుతూ వస్తోంది. శ్రీకాకుళం జిల్లా అంపోలు, మామిడివలస, అడవరం గ్రామాలలో ఈ కళాకారులు ఉన్నారు.



# ఘట నృత్యం

ఆంధ్రప్రదేశ్ జానపద నృత్యాలలో ఈ ఘట నృత్యం ఒకటి. ఒక్క జాతర సందర్భాల్లో తప్ప మరెప్పడూ ఈ నృత్యాలు జరగవు. పల్లెల్లో పశు జాడ్యాలు వచ్చినపుడు దేవతలకు ముడుపులు కట్టి మొక్కుతారు. ఇలా మొక్కిన కొన్ని దినాలకు గ్రామంలో ఇంటి ఇంటికి చందాలు వేసుకొని గ్రామ దేవతల విగ్రహాలను కొయ్యలతోనూ, మట్టితోనూ చేసి తాటి ఆకుల పాకల్లో ప్రతిష్ఠించి ఒక నెలరోజులు పంబల కథలతో ప్రదర్శనలు ఇస్తూ, జాతర చేస్తారు.

ఘటాన్ని నెత్తిన పెట్టుకొని ఊరేగే వారు చాకళ్ళ (రజకులు). ఘటం ఎత్తు కున్న వ్యక్తి ఎంతో ఉద్రేకంగా నృత్యం చేస్తారు. దీనికి ఏ విధమైన శాస్త్రం ఉందని చెప్పలేము. కానీ ఘట నృత్యం చూసేందుకు చాలా ఉత్తేజంగా ఉంటుంది. పూజ్య భావంతో ఎవ్వరితోనూ మాట్లాడక డప్పల వాద్యానికి అనుగుణంగా వీర నృత్యం చేస్తారు. దీనికి ఏ విధమైన సాహిత్యము లేదు. ఇది మూగ తాండవం. ఆవేశపూరితంగా సాగు తుంది. అలా జరిగేటప్పడు కొంత మందికి ఘణం పూనుతోంది. ఈ ఘణం పూనిన వ్యక్తులు చిందులు, శివాలు తొక్కుతారు. జాతర జరిగే గ్రామాల్లో మాత్రమే ఈ నృత్యం కనబడుతుంది. దీనిని దక్షిణ దేశంలో కడకూతు అని పిలుస్తారు. ఉత్తర హిందూ స్థానంలో గర్భనృత్యం అని పిలుస్తారు.



# గంట సాయిబు

కేవలం ఉత్తరాంధ్రలో మాత్రమే ఉన్న జానపద అంశం గంట సాయిబు. వీరు ఏడాదికొకమారు గ్రామాల్లోకి వెళతారు. వీరిని గుదగంటలోళ్లు, గిలకలోళ్లు అని అంటారు. నల్లటి కోటు వేసుకొని, ఎర్రటి తలపాగా, క్రిందన ఫ్యాంటు, వెనుక చేతిలో ఢమరుకం, భుజం మీద ఉన్న కర్రకు ఒకవైపు హరికెన్ లాంతరు మరోవైపు సంచి తగిలించి తెల్లవారుజామున అమ్మలు, బాబులు ఉటో... ఉటో.. అంటూ ఊర్దూ పదాలతో మేల్కొలుపుతారు. అల్లా దీవెన ఉండాలి అంటూ నిద్రపోయిన వారిని లేపుతాడు.

ఆ రోజుల్లో మూడురూపాయలు ఇచ్చిన వెంటనే దీవెనలు అందించే వాడు. పాడి, పంట అధికం కావాలి, పిల్ల పాపలు చల్లగా ఉండాలి, అల్లా దీవెన కలగాలి అని దీవిస్తూ ఇంటి ఇంటికి వెళుతుంటారు. వీరు కేవలం తెల్లవారి ఆరుగంటల వరకు మాత్రమే భిక్షాటన చేస్తారు. శీతాకాలంలో మాత్రమే వీరి భిక్షాటన ఉంటుంది. చిన్నపిల్లలు ఏడిస్తే గంటలోడికి ఇచ్చేస్తాము అని భయ పెడుతుంటారు. ఇది పూర్తిగా యాచక వృత్తి గల కళారూపం.



# పగటి వేషాలు

జానపద కళలలో జతకట్టజాలిన మరో జాతీయకళ పగటివేషాలు. ఇది పగటిపూట ప్రదర్శించే ప్రదర్శన అవ్వడం వల్ల ఈ ప్రదర్శనకు పగటి వేషాల ప్రదర్శనమని పేరు వచ్చింది. వీరు పాత్రల ద్వారా సంఘంలో ఉండే మూఢ నమ్మకాలను, దురాచారాలను ప్రజా పీడనను హాస్యధోరణిలో పెట్టి ప్రజలకు వినోదం ద్వారా విజ్ఞానం పరుస్తూ వుండేవారు. తగిన సాహిత్యంతో ఎవ్వరికి నొప్పి తగులకుండా హాస్యధోరణిలో వ్యంగ్యంగా గుట్టును బట్టబయలు చేసేవారు. ఈ పగటివేషాలను పూర్వం "బహురూపా"లని పిలిచేవారు. నాటకాలు బహురూపాలని పాల్కురికి సోమనాథుడు కూడా బసవపురాణంలో వివరించాడు.

జానపద గాథల పద్ధతిని రాజకీయాలకు ఉపయోగించిన వారిలో ప్రథముడు, అంతేకాక కళింగ గంగరాజు పగటివేషాల వారి సాయంతో శత్రువులను జయించారని కథ కూడా ఉంది. పగటివేషదారులకు గురువు మైసూరు తెలుగు బ్రాహ్మణుడు పల్లావజుల వెంకటరామయ్య. వీరు రేపల్లెలో ఉండి కొంతమందికి పగటివేషాలు నేర్పి, ప్రదర్శించి ప్రజల మన్ననలు పొందారు. కూచిపూడి వారిలో పురుషులే అర్థనారీశ్వర పగటివేషాన్ని ధరించేవారు. ఈ పగటివేషం జానపదులను ఎంతగానో ఆకర్షించి ఆనందింపజేసింది.

ఒకప్పుడు ఈ అర్థనారీశ్వర పగటి వేషాన్ని సుప్రసిద్ధ నటీమణి శ్రీమతి రాజ సులోచన అద్భుతంగా ప్రదర్శించేవారు. ఆంధ్రప్రదేశ్‌లో పగటివేషాలకు భిక్ష పెట్టినవారు గడ్డిపాడు పగటివేషదారులే. వీరు దాదాపు 60 రకాల చిత్ర విచిత్రమైన పగటివేషాలను ధరించేవారు. నిత్యజీవనానికి సంబంధించేవి కొన్ని, పౌరాణిక వేషాలు, కల్పనా వేషాలు, హాస్యరసంతో

కూడుకున్నవి. మొత్తం సంఘంలో ఉండే జాతీయ పాత్రలు వీరి వేషాలలో మూర్తిభవించేవి.

ఆటను, పాటను, మాటను, ఉచ్ఛారణను, వేషధారణను ఒంపులు, వయ్యారాలను విధిగా ఒకే విద్యలో అభ్యసించడం పగటివేషదారులకే చెల్లింది. ఈ పగటివేష ప్రయోగంలో చతుర్విద అభినయాలు ప్రాముఖ్యం వహిస్తాయి. తెల్లవార్లు ప్రదర్శన చూసిన ప్రేక్షకులు ముగ్ధులై ఇంకా ఆనందంలో ఉండగానే వారి నుంచి ఎక్కువ ప్రతిఫలాన్ని రాబట్టేవారు. అలా ప్రారంభింపబడిన పగటివేషాలే అలా అలా అల్లుకుపోయి కళాకండాలుగా ప్రచారం పొందాయి.



# సాతానదాసులు

ధనుర్మాసంలో సూర్యోదయంతో, పల్లెవాసుల్లో హరిదాసుని హరినామకీర్తన భక్తిభావాన్ని తట్టిలేపుతుంది. హరిదాసు రావడం సంక్రాంతి తేవడం అని పల్లెవాసుల నమ్మకం. నెలరోజుల పాటు సాగే ఈ హరినామ సంకీర్తన సంక్రాంతి తరువాత రోజు వచ్చే కనుమ వరకు కొనసాగుతుంది. శరీరానికి పట్టుపీతాంబరాలు ఒకచేత తంబుర తంత్రులను మీటుతూ మరోచేతితో చిటికెలు వేస్తూ కంచులోహ అక్షయపాత్రను శిరస్సుపైన ఉన్న తలపాగాపై పెట్టుకొని కాళ్ళకు సిరిమువ్వలు కట్టి హరినామ కీర్తనలను ఆలపిస్తూ, పల్లెవీధుల్లో సంచారం చేస్తూ, దర్శనం ఇస్తారు. వీరు ఎవ్వరినీ నోరుతెరిచి భిక్షం వేయమని అడుగరు. హరినామగానం విన్నవెంటనే పల్లెలోని పుణ్యస్త్రీలు బియ్యంతో వచ్చి హరిదాసు అక్షయపాత్రలో వేసి వారి పాదాలకు నమస్కరిస్తారు. వీటిని స్వీకరించిన తరువాత హరిదాసు కృష్ణార్పణం అని దీవిస్తారు. ఈ నెలరోజులు గ్రామంలో తిరుగుతున్నపుడు తన అక్షయపాత్ర నిండిన వెంటనే ఏదో ఒక ఇంటిలో అక్షయపాత్రలో ఉన్న బియ్యం వదిలి వెళ్లిపోతాడు. నెలరోజుల తరువాత ఆ ఇంటికి వచ్చి కావెళ్ళతో ఆ బియ్యాన్ని తీసుకువెళతారు. ఎవరి ఇంటిలోని అయితే ఈ బియ్యం ఉంచుతారో వారు మరికొంత భాగాన్ని దానికి కలిపి వారికి ఇస్తారు. ఆ ఇల్లు సుభిక్షంగా ఉంటుందని నమ్మకం.

తెలుగు ప్రజలకు అన్ని పండుగల కంటే మకర సంక్రాంతి చాలా పెద్ద పండుగ. సంవత్సరమంతా కష్టపడిన పంటను ఇంటికి తీసుకువచ్చి కష్టజీవులైన రైతులందరూ ఆనందోత్సాహాలతో జరుపుకొనే పెద్ద పండుగ. ఈ నెలరోజుల్లో అనేకమంది వృత్తికళాకారులు జంగాలు, దాసర్లు వంటివారు గ్రామాలను సందర్శిస్తారు. ఆ రోజుల్లోనే ఈ సాతాన దాసులు కూడా వస్తారు. ఇందులో సాతానులు, దాసర్లు అన్ని కులాలు కూడా ఉన్నాయి.



# సాతాని వైష్ణవులు

సాతానులు వైష్ణవ మతానికి చెందినవారు. శైవం, వీరశైవం ఆంధ్రదేశంలో విజృంభించిన తరువాత రామానుజుని వైష్ణవం ప్రవేశించింది. వైష్ణవ దేవాలయాల్లో గుడి సేవకులుగా ఒక శూద్ర వర్గం ఏర్పడింది. వారినే సాతానులంటారు. తమిళంలో 'సాత్యదవక' అనే మాట నుండి సాతాని అనే మాట వచ్చింది. సాతాని అంటే ముసుకోనివాడు (తలను, జంధ్యాన్ని, పంచెకట్టు) చక్రాంకితాలు వేసుకుంటారు. పంగ నామాలు పెట్టుకుంటారు. తులసికొమ్మలను తలకు చుట్టుకుంటారు. విసనకర్ర పట్టుకొని నెత్తిమీద గాని చేతిలో గాని అక్షయ పాత్రపెట్టుకొని ఆళ్వారుల పాశురాలను పాడుతూ భిక్షాటన చేస్తారు. బలిజవారిని, కోమట్లను యాచిస్తారు. కీర్తనలతో వైష్ణవప్రచారం చేస్తారు.

ఉత్తరాంధ్రలో సాతాని వైష్ణవులు ఉన్నారు. వీరు వెనుకబడిన కులాలకు చెందినవారు. శ్రీవైష్ణవులు తరువాత సాతానివైష్ణవులు వస్తారు. వీరిలో సాతాన వైష్ణవులు (కుమిలి, విజయనగరం మొదలగు ప్రాంతాలలో ఉండగా) వాల్మీకి వైష్ణవులు (జొన్నగుడ్డి విజయనగరం) ఇంకా కొన్ని తెగలున్నాయి. అంతర్వివివాహాలు లేవు. అక్షయపాత్ర ధరించి తెలగ, రెడ్డి, పెద్ద కాపులకు, పల్లీలకు (శూద్ర కులాలకు) పెరుమాళ్ల పూజ (చావు, కర్మకాండలు) నిర్వహిస్తారు. శూద్ర కులాల కర్మకాండ లకు ఈకులాల వారు బ్రాహ్మణులను పిలువరు.



వీరు యాచన చేసేటప్పుడు త్యాగరాజుకీర్తనలు, రామదాసు కీర్తనలు, కృష్ణునిపై గీతాలు (కస్తూరి రంగ రంగ) హనుమాన్ చాలీసా, విష్ణుసహస్రనామాలు ఆలపిస్తారు. కార్తీక మాసం లోను సంక్రాంతి, పున్నమి రోజులలో ఇతర కులాలు చేసే దానధర్మాలు స్వీకరిస్తారు. సంక్రాంతి రోజులలో భోజీలకు (విందులకు) వెళ్తారు. ధనుర్మాసంనెల రోజులలో భిక్షాటన చేస్తారు. ఖాళీ సమయాలలో టైలరింగ్ చేస్తారు.

# బుడబుక్కల వారు

బుడబుక్కల వారు భక్తిని ప్రతిపాదిస్తూ పురాణ సంబంధమైన అనేక అంశాలు చెబుతూ ప్రజలకు నీతిబోధన చేయడం బుడబుక్కల వాని ప్రధాన ఉద్దేశ్యం. ఈ వేషంలో రామజోగి అనే వేషగాడు ఈ పని చేస్తుంటాడు. చిన్న ఢమరుకం లేదా బుడిగి పట్టుకొని నడుంకు ఒక గంట కట్టుకొని తమ వీపు మీద చర్మం తలపాగా చుట్టుకొని దానిమీద ఒకటి నుండి నాలుగు జతల బట్టలను వేసుకొని ముఖానికి పెద్ద బొట్టుపెట్టి, గుబురుగా పెరిగిన మీసాలు, భుజం మీద పెద్ద జెంఖానా వేసుకొని నడుంకు గంట కట్టుకొని చేతిలో లాంతరు పట్టుకొని వీధిలో గంభీరంగా నడుస్తూ భక్తి ప్రచారం చేస్తూ, అనేక పురాణ గ్రంథాల నుంచి ఉదాహరణలు ఇస్తూ సామెతలతో ప్రజలను మెప్పిస్తూ నైతిక బోధ చేస్తారు. అంబ పలుకు జగదంబ పలుకు మా ఇష్టదేవత పలుకు అని పొలిమేర దేవతను కట్టి కీడు పలికే పక్షులను, మేలుపలికే పక్షులను వేరు వేరుగా తెలిపి ఎదుటవారి మనస్సులో కలిగిన ఉద్దేశ్యాలను వివరిస్తూ జనరంజికమైన రామజోగి పలుకులను వినండి అంటూ మహారాజా రాజ మార్తాండ తేజ.. రవికల్ప భూజ, రాజసూత్రమా, శుభోదయం కలుగవలె. మీ పని నయంగా ఉండాలి. అంటూ ప్రజలను ఆకట్టుకుంటారు. బుడబుక్కల జాతి వారు ఒక ప్రత్యేకతను సంతరించుకున్నారు. వీరు రాత్రి సమయంలో మాత్రమే యాచన చేస్తారు. ఇలా చేసే వారిలో బొందిలీలు, భరత సాయిబులు, గంట సాయిబులు, రేయి తురక సాయిబులు, గిలకలోళ్లు అని ఇలా ఒకో ప్రాంతంలో ఒకే పేరుతో వ్యవహరించబడుతున్నారు. వీరు రాత్రి 12 గంటలు దాటిన తరువాత తెల్లవారుజాము 4 గంటల వరకు భిక్షాటన చేస్తారు. ☼



# కొమ్మదాసరి

కొమ్మదాసరి, దాసరి కులంలో ఒక శాఖ. వీరు సంచార జీవనానికి అలవాటుపడినవారు. గంగిరెద్దుల వారు కూడా తమలో కొంతమంది కొమ్మ దాసరులున్నారని చెబుతారు. ఏమైనప్పటికీ దాసరులలో ఒక ఉపకులమిది.

రంగు రంగుల టోపి పెట్టుకొని చేతిలో తాళాలు, టోపికి వెనుక ప్రక్క కొమ్మలను తగిలించుకొని కొమ్మదాసరులు ప్రవేశిస్తారు. కొమ్మదాసరి అంటే కొమ్మమీద కూర్చోని ప్రసంగం చేసేవారు. కొమ్మలే కాకుండా ఎత్తైన గోడలు, ఎత్తైన చెట్లు, బండిమీద కూడా నిల్చోని క్రిందన గుడ్డ పరుస్తారు.

కొమ్మదాసరోడు వచ్చినాడప్పో...

వరాలప్పా! ముత్యాలప్పా! నిర్మలప్పా! శ్రీదేవప్పా! లచ్చిమప్పో! శాంతప్పో! కాంతప్ప! సరస్వతప్ప అంటూ ఆడవాళ్లు పేర్లు పెట్టి పిలుస్తారు. పేర్లు వారివి కాకపోయినా ఏవో కొన్నిపేర్లుతో పిలుస్తారు. నేటికి పరిస్థితికి తగ్గట్టుగా ఇలియానప్ప, కాజలప్పా అని సినిమా నటీమణుల పేర్లతో కూడా పిలుస్తారు.



మాఅప్ప విజయవాడలోనున్న, విశాఖ పట్నంలోనున్న, శ్రీకాకుళంలోనున్న చల్లగానుండాలి అంటూ కొమ్మ మీదే ఉండి యాచిస్తాడు. ఎంతకీ ఎవ్వరూ దానం చేయకపోతే అక్కా పప్ప కుండలో దూకేస్తా... కిందకు దూకేస్తా... పొయ్యిలోకి దూకేస్తా... మూతి పగులుతాది... ముక్కు చితుకుతాది అంటాడు. కిందపరచిన గుడ్డలో ఎంతవేస్తే అంత డబ్బులు తీసుకుంటాడు. కొమ్మదిగినాక కోటి రూపాయలు ఇచ్చినా కొమ్మదాసరి పుచ్చుకోడు. ఇది వీరి కులాచారం. ఇటీవల వీరి సంఖ్య తగ్గుతూ వస్తుంది.

# ఎరుకలోళ్ళు (సోదె)

ఎరుకుల స్త్రీలు సోదె  చెప్పినపుడు 'సోదిగొల్లలని' కూడా చెప్పకుంటారు. ఎరుక అనగా భూత, భవిష్యత్, వర్తమాన కాలముల మనుగడను ఎరుకపరుస్తారు కాబట్టి ఎరుకుల వారని పిలుస్తారు. ఎరుకుల స్త్రీలు సోదె చెబుతారు. ప్రాచీన కాలం నుండి సోదె చెప్పినట్లు మనకు పురాణాలు బట్టి తెలుస్తుంది. 16వ శతాబ్దాపు యక్షగాన కృతులలో ఎరుకులసాని గురించి ప్రస్తావన ఉంది. శ్రీకృష్ణదేవరాయులు ఆముక్తమాల్యదలో ఎరుకులసాని పాత్ర చేర్చారు. కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వెంకటేశ్వరస్వామి సైతం తమ ప్రియురాలు పద్మావతి వద్దకు ఎరుకులసాని వేషంలో వస్తారు. యక్షగానాలలో వర్ణించిన ఎరుకులసాని నిలువెత్తు శిల్పాన్ని మధురైలోని వెయ్యిస్తంభాల మండపంలో ప్రతిష్టచేశారు. భారతంలో ఎరుకరేని కుమారుడు ఏకలవ్యుడు ద్రోణునివద్దకు విద్యను నేర్వడానికి రాగా ఎరుకుల కులస్థుడని ద్రోణుడు విద్యనేర్పలేదు. అయినా గురు దక్షిణగా ఏకలవ్యుడు బొటనవ్రేలు తెగనరికిస్తాడు. వీరిలో కుంచె ఎరుకుల, దబ్బ ఎరుకుల, కాపు ఎరుకుల అని మూడు భాగాలు ఉన్నట్లుగా తెలుస్తుంది. ఈ మూడు ఉప కులాలలో ఇటీవల వరకు అంతర్వివాహాలు లేవు. కంచం పొత్తేగాని మంచం పొత్తు లేదు. రాష్ట్రవ్యాప్తంగా ఉప్పఎరుకుల బద్దలఎరుకుల తెగలు ఉన్నట్లుగా తెలుస్తుంది. వీరు మైదాన ప్రాంత గిరిజన తెగకు చెందుతారు. ఎరుకుల భాష ఉంది. కాని లిపి లేదు. ఇందులో తమిళ పదాలు ఎక్కువగా ఉంటాయి. ఏ ప్రాంతం వారు ఆ ప్రాంతపు గ్రామ దేవతలను తలచుకోవడం జరుగుతుంది. వీరి శాస్త్రం ప్రకారం మందగువ్వ పక్షి దక్షిణాన కూర్చోని, ఉత్తరం వైపు అరిస్తే ఆది, శని, మంగళ వారాల్లో



యుద్ధం లేదా ప్రళయం పుడు తోంది. పడమర కూర్చోని అరిస్తే ఆవులు, గేదెలు మొదలగు మూగ జీవులు చని పోతాయి. తూర్పున కూర్చోని అరిస్తే గ్రామాలకు నష్టం. ఈ విద్య ఈ తరం వారిది కాదు. తాత ముత్తాల నుండి ఈ విద్య వస్తుంది. గ్రామాలలో పంటల కాలంలో వెళ్లి పాటలు పాడతారు. సోది చెప్పి వారు ఇచ్చినవి పుచ్చుకుంటారు.

# జంగాల కథలు

శివుడు జంగం దేవర వేషంలో ఉంటాడు. మనరాష్ట్రంలో మూడు కులాలుగా విభజింపబడ్డారు. వెనుకబడిన కులానికి చెందిన జంగాలు శ్రీకాకుళం జిల్లాలో పూజారులుగా వున్నారు. కొంతమంది కర్మకాండలు నిర్వహిస్తారు.

నందిమకుటం గల గంటను వాయిస్తూ శంభోశంకర అంటూ శంఖాన్ని పూరిస్తూ బసవపురాణంలోని బసవేశ్వరుని సూక్తులను సోదాహరణంగా ఉదహరిస్తారు. శూద్రకులాలకు కర్మకాండలను కూడా చేస్తారు. వీరశైవమతాన్ని ప్రబోధించే ప్రచారకులుగా ఊరూరా తిరుగుతుంటారు. సంక్రాంతి పండుగ రోజులలో బలహీన వర్గాలకు చెందిన కులాల వారు చనిపోయిన పెద్దలకు పొగడింపు పెట్టిస్తారు. ఉత్తరాంధ్రలో కాపులు, వెలమలు, కాళింగులు మొదలగు ఇండ్లకు పోయి గంట వాయిస్తూ పెద్దలను పొగడ్తారు. మాల జంగాలు ఒక్క మాల ఇండ్లకు వెళ్తారు.

బుడిగ జంగాలను గుదగంట జంగాలు అని కూడా పిలువబడుతున్నారు. వీరు వెనుకకు గంట కట్టుకొని చేతిలో శంఖం పట్టుకొని గ్రామాలకు వెళతారు. వీళ్ళ ఊళ్లను పంచుకుంటారు. సంవత్సరానికి ఒకసారి గ్రామాలలో ఇంటింటికి వెళ్లి కథలు పాడుకుంటూ యాచిస్తారు.



బేడ జంగాలు, బుడిగె జంగాలు షెడ్యూలు కులానికి చెందుతారు. మనరాష్ట్రంలో ఎక్కువ సంఖ్యలో వీళ్లు ఉన్నారు. బుడిగె పట్టుకొని పాటలు పాడుతూ భిక్షాటన చేస్తారు. వీరు పాతరోజులలో బేడ డబ్బులు (పన్నెండు పైసలు) ఇస్తే పొగిడేవారు. అందుకే వీరికి బుడిగె జంగాలు అని పేరు వచ్చింది. వీరు పాడే పాటలు బొబ్బిలి యుద్ధం, బాలనాగమ్మ, సన్యాసమ్మ, గంగా గౌరి సంవాదం, చెంచు పాట, సారంగధర మొదలగు పాటలు పాడతారు. కోటి సంపదలు కలిగి చల్లగా జీవించాలి అని పొగడుతారు. పాతరోజుల్లో రాత్రి పూట కూడా పాటలు పాడేవారు. ఇప్పుడు ఎవరూ రాత్రి పాట పెట్టించడం లేదు. ఇందు నంది మకుటం గల గంట వాయిస్తూ గంట జంగాలుగా ఉన్నవారు నందివాహన శివాయనమః నాగాభరణ శివాయ నమః అంటూ పాటలు పాడతారు.

# పల్నాటి వీర చరిత్ర

పల్నాటి వీర శౌర్యాన్ని వీరావేశంతో ఆనాటి వీరుల గొప్పదనాన్ని తెలియచేస్తూ చెప్పేకథ పల్నాటి వీర చరిత్ర పల్నాటివీరుల ప్రతాపాన్ని కళ్లకు కట్టినట్లు చూపుటకుగాను ఈ కథకుడు కత్తి, డాలు ధరించి నృత్యం చేస్తూ కథ చెబుతాడు. సహాయకులుగా వీరజోడు హార్మోనియం కళాకారులు వారి వాయిద్యాలు వాయిస్తూ వంతపాడుతూ ఉంటారు. కథకుడి కాళ్లకు ధరించిన కత్తికి గజ్జెలు ఉంటాయి.

పల్నాటి వీర చరిత్రలోని ముఖ్య ఘట్టాలైన కోళ్ల పందెం, నాగమ్మ, బ్రహ్మనాయుడుల వైరం, పెద్దన్నరాయబారం, వీర్ల అంకమ్మ పుట్టుక, బాలచంద్రుని జననం మరియు బాలచంద్ర విజయం మొదలైన ఘట్టాలను వీర కరుణ రసాలతో కథను చెప్పే కథకుడు ప్రేక్షకులను ఆకట్టుకుంటాడు.



ఈ కథకుని పేరు శ్రీ వెన్నపూస వెంకటేశ్వరరావు, ఈయన స్వగ్రామం పొన్నూరు, పల్నాడులో జరిగిన కథకు ఆ ప్రాంతంవాసుడు కాక పొన్నూరు వాస్తవ్యుడు చెప్పటం కళాకారునికి ఈ కథావస్తువుపై ఉన్న మక్కువకు తెలియచేస్తుంది.

పల్నాటివీరుల శౌర్యాన్ని అద్దంపట్టుతూ మాచర్ల పట్టణం దగ్గరలో వీరుళ్లగుడిలో ఆ వీరులు వాడిన ఖడ్గాలు, బరిసెలు, డాళ్లు అన్నీ భద్రపరచబడ్డాయి. సంవత్సరానికొకసారి వీరుల పండుగ జరిపి ఆ ఆయుధాలను ఊరేగిస్తారు. ఆయుధాలు చూస్తునప్పడు అప్పటి పల్నాటి వీరులు యుద్ధం చేస్తున్నంత ఉద్వేగం కలుగుతుంది. బాలచంద్రుడు యుద్ధంలో గాయపడినప్పడు గంగధార వద్ద కూర్చుని గాయం కడుక్కొని బయటకు వచ్చిన ప్రేగులు లోపలికి త్రోసి బిగించి కట్టుకొని మళ్లీ యుద్ధానికి వెళ్లినట్లు చరిత్ర చెబుతోంది. పై కారణాలవల్ల కథకుడు పల్నాటివీరుల శౌర్యానికి ప్రతీక అయిన కత్తి, డాలులతో కథ చెప్పటకు ఔచిత్యముంది.

వీరి తండ్రి తాత ఈ కథ చెప్పేవారు. తర్వాత ఈ కళాకారుడు ఈ కథను చెప్పతున్నారు. వీరులను కొలిచేటివారి ఇళ్లలో జరిగే పెళ్లిళ్లు, వీరుళ్ల పండగలప్పడు వీరుళ్లను కొలిచేటప్పడు ఈ కథను చెప్పించుకుంటారు.

ఈ కథకు నలుగురు కళాకారులు ఉంటారు. (1) కథకుడు (2) వీరబోజోడు వాయించు కళాకారుడు (3) హార్మోనియం వాయించు కళాకారుడు (4) వంతపాడు కళాకారుడు ఉంటారు.వీరందరూ పిచ్చుకగుంట్ల కులానికి చెందినవారు.

# గొరవయ్యలు

గొరవయ్యలను గొడుగు మల్లయ్యలని, మల్లన్నలని, మల్లయ్యతాతలని, గొర్గయ్యలని ఆంధ్రప్రదేశ్‌లోనూ, ఒగ్గప్పలని కర్నాటకలోనూ పిలుస్తారు. గొరవయ్యలనగా పెద్దవారని, గురువులని అర్థం వీరు కురమ కులంలో పూజారులుగా వ్యవహరిస్తూ శైవమత వ్యాప్తిని తిరుగుతూ ప్రచారం చేస్తారు. అనంతపురం, కర్నూలు, జిల్లాలలో ఎక్కువగా నివసిస్తున్నారు. కర్నాటక రాష్ట్రంలో బళ్ళారి, అనెగొండ, హోస్పేట, గంగావతిలోను ఎక్కువగా ఉన్నారు. వీరు దసరా పండుగ రోజులలో కర్నూలు జిల్లాలోని గట్టు మల్లయ్య కొండగ్రామంలో వేంచేసివున్న శ్రీ మల్లన్న స్వామిని పూజించి రక్తమును స్వామికి భక్తిపూర్వకంగా అర్పిస్తారు. గొరవయ్యల ఆవిర్భావం గురించి రెండు కథలు చెప్పచున్నారు. మొదటిది పూర్వం "మని, మల్లాసుర" అను రాక్షసులు శివుని గురించి తపస్సు చేసి ఆయన వద్ద నుండి ఎన్నో వరాలతో పాటు ఆయుధంతో తమను ఎవరూ చంపలేరనే వరం పొందారు. వీరికి అహంభావం పెరిగి భక్తులను హింసించే వారు. వారి అకృత్యాలు గమనించి పరమశివుడు భైరవరూపంలో వచ్చి ఆ రాక్షసులనిద్దరిని సంహరిస్తాడు. ఆరాక్షసులిద్దరూ తమను సంహరించినది పరమశివునిగా గుర్తించి శివుని మూడు రక్తపుబొట్లు ఆయన ఎడమతొడనుండి ఇవ్వవలసిందిగా కోరారు. అంతట పరమశివుడు ప్రతి దసరా పండుగరోజున తాను గొరవయ్య రూపంలో వచ్చి తన ఎడమ తొడనుండి మూడు రక్తపుబొట్లు ఇస్తానని తెలిపారు. ఈ పురాణగాథను ఇప్పటికీ ప్రతి దసరారోజున ప్రదర్శిస్తారు.

రెండవ కథ ఏమనగా మల్లన్నదేవుడు, ఆయన భార్య మాలవ్వ దేవత ఒకసారి వారియొక్క గణాలు అనగా వారి కుక్కల సామర్థ్యం పరీక్షించుటకై ఇరువర్గాలవారికి ఒక ఇనుపగొలుసు తెంచమని పోటీ పెట్టగా ఆ పందెంలో మాలవ్వయొక్క గణాలు గొలుసును త్రెంచి పందెం గెలిచాయి. అంతట మల్లన్నదేవుడు ఆ సందర్భానికి గుర్తింపుగా తనగణాల

వారిని ఉత్సవం చేయమని ఆదేశించెను. ఒక పళ్లెం నిండా పాలుపోసిపెట్టి రెండు గణములు (కుక్కలు) త్రాగమనగా ఆ రెండు గణాలు (కుక్కలు) ఆ పళ్లెం చుట్టూ తిరుగుచూ ఒకరిపై ఒకరు అరచుకొనుచూ కరచుకొనుచూ పాలు త్రాగేవి. దీనినే ఒగ్గు సేవ అంటారు. ఇప్పటికీ శివరాత్రి పర్వదినాన గొరవయ్యలు భక్తులు తీసికొని వచ్చిన పాలను ఒక పళ్లెంలో పోసి ఆ పళ్లెం చుట్టూ నృత్యం చేస్తూ తిరుగుచూ ఒకరికి ఒకరు కుక్కలవలె అరుస్తూ కరచుకుంటూ పాలు త్రాగుతారు. వారు త్రాగగా మిగిలినపాలను, మిగిలిన పళ్లను ప్రసాదంగా భక్తులు భక్తితో స్వీకరిస్తారు. తరువాత ఇనుపగొలుసును త్రెంచుతారు.

గొరవయ్యల నాయకుడు త్రిశూలంతో తన ఎడమతొడను పొడుచుకొని వచ్చిన రక్తాన్ని భగవంతునికి అర్పిస్తాడు. ఈ విధంగా గొరవయ్యలు వారి ఆవిర్భావానికి సంబంధించిన కథలను భక్తి ప్రపత్తులతో ప్రదర్శిస్తారు.

వీరి ఆహార్యం మెడ నుండి పాదాలవరకు నల్లగొర్రె ఊలుతో చేయబడిన అంకారక, ఎలుగుబంటి చర్మంతో చేయబడిన టోపి, మెడచుట్టూ రంగుల లేసు, నడుంచుట్టూ గంటలు, కాళ్లకు గజ్జెలు ఉంటాయి. ఒక చేతిలో త్రిశూలం, ఇంకొక చేతిలో పిల్లనగ్రోవి ఉంటాయి. అనగా శివ కేశవులకు బేధం లేదని తెలుపుట ఈ వేషధారణయొక్క ముఖ్య ఉద్దేశ్యము. పిల్లనగ్రోవిని ఊదుతూ, ఢమరుకాన్ని వాయిస్తూ లయబద్ధంగా చిందులతో నృత్యం చేస్తూ ఉంటారు.

కురమకులంలో "గొరవయ్య దీక్ష" తీసికొనిన వారిని గొరవయ్యలుగా అంగీకరించి గౌరవిస్తారు. తల్లితండ్రులు వారు మొక్కుకున్న విధంగా వారి పిల్లల్లో ఎక్కువగా పెద్దపిల్లవానిని భగవంతుని సేవకై అర్పిస్తారు. అట్టి పిల్లలలకు చిన్నవయస్సులోనే గొరవయ్య పెద్దతో దీక్ష ఇప్పిస్తారు. పెద్ద

గొరవయ్య పిల్లవానికి మంత్రం ఉపదేశం చేసి బండారు అతని భుజములకు పెట్టి అతను ఆ రోజు నుండి వేసుకొనవలసిన గొరవయ్య దుస్తులను ఇస్తాడు. ఆ రోజు నుండి ఆ బాలుని భగవంతుని సేవకునిగా గుర్తించి గౌరవిస్తారు.. పండుగ రోజులలో గొరవయ్యలు భగవంతున్ని కీర్తిస్తూ వారికి "బండారు" ఇచ్చి ఆశీర్వదిస్తారు. వారు నాలికలో శూలము గుచ్చుకొనుట, బుగ్గలలో శూలం గుచ్చుకొనుట మొదలయిన భయంకర విన్యాసములు చేస్తారు.

గొరవయ్యలుగా కురమ కులస్థులేకాక అన్ని కులాలవారు ముఖ్యంగా సంఘంలో అట్టడుగు వర్గంవారు కూడా గొరవయ్య దీక్ష తీసికొని భగవంతుని సేవకులుగా గౌరవించబడుచున్నారు. సర్వమానవ సమానత్వము ఈ గొరవయ్యల ముఖ్యోద్దేశ్యం.



# మహంకాళి నృత్యం

దుష్టశిక్షణకారిణి కాళికాదేవి రూపం భయంకరంగా ఉంటుంది. అటువంటి భయంకర రూపిణికి నృత్యం, డప్పు వాయిద్యాల మీద చేస్తే బాగుంటుంది అనే ఆలోచనతో ఈ కాళికాదేవి నృత్యాన్ని రూపకల్పన చేయటం జరిగింది. పశ్చిమగోదావరి జిల్లా, తాడేపల్లిగూడెం ప్రక్కనగల జగన్నాధపురం గ్రామానికి చెందిన శ్రీ జక్కం ధనరాజు కుటుంబం తాతల నాటి నుండి డప్పు వాయిద్యకళాకారులు శ్రీ ధనరాజు కూడా డప్పు వాయిద్య కళాకారుడు. డప్పు వాద్యానికి జోడించి శ్రీ ధనరాజు కాళికాదేవి నృత్యాన్ని రూపకల్పన చేయటం జరిగింది. క్రమేపి ప్రదర్శనలనిచ్చుకుంటూ, నృత్యాన్ని ఇంకా మెరుగుపరచుకుంటూ ఇప్పడు సదరు నృత్యాన్ని ఒక క్రమపద్ధతిలో ప్రదర్శించుట జరుగుతోంది.

ఈ నృత్యం 11 మంది కళాకారులతో భక్తి, భయానక భావాలతో కొనసాగుతుంది.

ఈ నృత్యంలో ప్రత్యేకత కాళికాదేవి వేషధారి ముఖంపై మాస్క్ లేకుండా పొడుగాటి ఎర్రనాలుకను మాత్రమే పెట్టుకొని నృత్యం చేయుట, హారతి కర్పూరాన్ని అరచేతిలో వెలిగించుకొని ఆ మండుతున్న హారతిని నోట్లో వేసుకొనే సన్నివేశం ప్రేక్షకులను గగుర్పాటు కలుగచేస్తుంది. తనపై యుద్ధానికి వచ్చిన ఫకీరును కాళికాదేవి జయించి ఫకీరును కాళ్లక్రింద పెట్టి త్రొక్కుట, దుష్ట శిక్షణను కళ్లకు కట్టినట్లుగా ప్రదర్శించుట జరుగుతోంది.

నలుగురు నర్తకీమణులు తమ అలుపెరుగని నృత్యంతో ప్రేక్షకులను అలరిస్తారు. విశేషమేమనగా వారు స్త్రీలు కాదు. పురుషులే స్త్రీ వేషములు ధరించినారని తెలిసినప్పడు ప్రేక్షకులు ఆశ్చర్యపోకతప్పదు. 5 మంది డప్పు వాద్య కళాకారులు నృత్యం మొదటి నుండి చివరివరకు అలుపెరుగక

లయబద్ధంగా వాయించటం ప్రసంశనీయం. అమ్మవారి జాతర్లకు, ఊరేగింపులకు, గణపతి ఉత్సవాలప్పుడు వీరి ప్రదర్శనను గ్రామాలలో ఏర్పాటు చేయుట జరుగుతోంది.

ఈ కళాకారులకు వేరే వృత్తిలేదు. చెయ్యరు. వీరు ప్రదర్శనలు ఉన్నప్పుడు ప్రదర్శించుట లేనప్పుడు తమ నృత్యాన్ని మెరుగుపరచు కొంటున్నారు.



# శివశక్తులు

వీరు కూర్మకులానికి చెందిన పూజారులు. వీరిలో ఉన్న కంకణం మరియు ప్రతి కంకణం ధరించినవారుంటారు. వారి ఆరాధ్య దైవం "బీరప్ప" ఆరాధ్య దైవానికి వారు 2 సం.లు. లేదా 3 సం.లు. లేదా 5 సంవత్సరాలకొకసారి కల్యాణం చేస్తూ ఉంటారు. అప్పుడు ఈ శివశక్తుల చేత వారం రోజులపాటు బీరప్ప కల్యాణోత్సవాన్ని నిర్వహిస్తారు. వీటిలో కత్తులతో పొడుచుకోవటం, డోలు విన్యాసం, ప్రాణంతో ఉన్న మేకని గొంతుకొరికి చంపటం ఉంటాయి. చివరి రోజున బీరప్ప దేవుని వేషం ధరించి కులాన్ని దీవించి కురుమ కులంవారిచ్చిన సంభావన తీసుకొని వస్తారు. ఈ విధంగా చేయుటవల్ల వారి గొర్రెల మందలను మరియు వారి పిల్లపాపలకు క్షేమం కలుగుతుందని విశ్వాసం.

ఈ బృందం 12, 16, 20 మంది వరకు ఉంటారు.

డోలు వాద్యాలు - 4, నపీర- 2, (నపీర) తాళాలు - 2

శూలాలతో, కత్తులతో పొడుచుకునేవారు 6 లేక 8 మంది ఉంటారు.



నృత్యం చేసేవారందరికీ కళ్లకు చిన్న గజ్జెలు, పిక్కలకు పెద్ద గజ్జెలు, నడుముకు గంట, గొంగళి, వీరగోల ఉంటాయి. కుడిచేతిలో ఉక్కుశూలం, ఎడమచేతిలో వెండిశూలం ధరించి భుజాలపైన, నాభిపైన పొడుచు కుంటూ ఉంటాడు.

ఈ విద్యను వంశపారంపర్యంగా నేర్చుకొంటున్నారు. కొలువులు లేనపుడు వ్యవసాయం చేసుకుంటారు. శివశక్తులు మనిషిలోని వీరత్వాన్ని పెంపొందించి తద్వారా పౌరులలో దేశభక్తిని పెంచి తన మాతృదేశరక్షణకై వీరోచితంగా పోరాడి అవసరమైన యెడల ప్రాణత్యాగమైనా చేయుటకు సయితం సిద్ధపడు నట్లుగా చేయుట ఈ నృత్యం యొక్క ముఖ్యోద్దేశంగా భావించబడుతోంది.

# గరిడి

అందరినీ ఆహ్లాదపరచటం ఈ కళయొక్క ఒక ఉద్దేశ్యం. ఈ నృత్యానికి లయ "భేరీ" వాద్యం. పెద్ద కాలిరేకు అందెలు, గోనె పట్టాలను మోకాలివరకు కట్టుకొని గోనెపట్టాలపైన అందెలు మోకాలి వరకు తొడుక్కుంటారు. చేతిలో ఎర్రజండాలు పట్టుకుంటారు.

భేరీ వాద్యం, అందెల శబ్దం కలసి, పాడే పాటకు మంచి సంగీతాన్ని సమకూర్చుతాయి. భేరీలు వాయించేటప్పడు విన్యాసాలు చేస్తూ ఉంటారు. ఆ విధంగా విన్యాసాలు చేయుటమే గరిడి నృత్యం.

ఈ నృత్యానికి వాద్యాలు

భేరీలు - 2, తాషా - 1 అందెలు - ఒక్కొక్కరికి 6 లేక 8 ఉంటాయి.

బృందంలో 19 మంది నృత్యం చేసేవారు, ఒక పాటగాడు ఉంటారు. ఆడమనిషి నృత్యం చేస్తూ, పాటకూడా పాడుతూ ఉంటుంది.

ఎక్కువగా ఈ నృత్యంలో భక్తిగీతాలు, జానపదగీతాలు పాడుతూ ఉంటారు. ఈ గరిడి నృత్య కళాకారులు తూర్పుగోదావరి జిల్లా అత్తలపూడి, రామచంద్రాపురం, ద్రాక్షారామం, మడుపల్లి గ్రామాలలో ఉన్నారు. ఈ కళాకారులు ఎక్కువగా హరిజన, మాదిగ కులస్థులు.

పండగలకు, దేవతా ఉత్సవాలకు యెక్కువగా ఈ కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు. మిగిలిన రోజులలో ఈ కళాకారులు వ్యవసాయం, వ్యవసాయ కూలి చేసుకొని బ్రతుకుతున్నారు.

# భట్రాజులు

"భట్రాజులు" అనగా వీరినే భట్టుమూర్తులు అని కూడా అంటారు. పూర్వకాలంలో రాజుల పరిపాలనలో రాజాస్థానాలలో కవులుగా విదూషకులు గాను, వందిమాగదులుగాను ఉండేవారు. వీరు సకల శాస్త్ర పాండిత్యం కలిగి మహారాజుల యశోకీర్తిని, పొగిడి, గానం చేస్తూ వారి నుండి కానుకలు అందుకొనేవారు. అగ్రహారాలు, ధనధాన్యాలు పొంది జీవనోపాధి సాగించేవారు. ఎదుటవారిని ప్రసన్నం చేసుకోవడం వీరి విధి. రాజ్యాలు పోయినా, రాజులు పోయినా ప్రజలే రాజులుగా ప్రజలవద్దకు వెళ్లి వారిని పొగుడుతూ వారిచ్చిన బహుమతులు, ధనధాన్య వస్తు వాహనాలు స్వీకరిస్తూ బ్రతుకుతెరువు సాగిస్తున్నారు. ఈనాడు వీరు తెల్లని పంచె, తెల్లని లాల్చీ ధరించి, విలువైన కండువా భుజానవేసుకొని తలకు పాగా చుట్టి, బుగ్గ మీసాలతో నుదుటనామాలు చేతిలో బెత్తంతో అచ్చ తెలుగుతనం ఉట్టిపడే విధంగా వీరి ఆహార్యం ఉంటుంది. జయీభవ, విజయీభవ, దిగ్విజయీభవ అని పొగుడుతూ ప్రజలను మెప్పిస్తూంటారు.

సాహసకృత్యాలను వర్ణించడంలో వీరు ప్రసిద్ధులు, నిజానికి మన తెలుగు వాస్తవ చరిత్రను పద్యరూపంలో భద్రపరచిన ఘనత ఈ భట్రాజులకే దక్కుతుంది.

పద్మశాలీలవద్ద పడిగ రాజులనే భట్టువారుండేవారు. ఈ భట్రాజులను ఆధారంగానే పగటివేషాలు పుట్టాయి. కూచిపూడి భాగవతుల పగటివేషాలలో ఇది కూడా ఒకటిగా ప్రసిద్ధికెక్కింది. మనల్ని యెవరైనా పొగుడుతుంటే "భట్రాజుపొగడ్తలకేంలే" అని అంటుంటాం. ఆనాడు భట్రాజులు రాజుల యశోకీర్తిని పొగిడి గానం చేసి వారి నుంచి కానుకలు అందుకునేవారు. ఎదుటివారిని ప్రసన్నం చేసుకోవటం వీరి విద్య.

ఈ భట్రాజు పగటివేషగాళ్ళుగా వస్తూనే జయీభవ! విజయీభవ! ధరసింహాసనమై నభంబు గొడుగై, తద్దేవతల్ భృతులై, బ్రహ్మాండాకారమై, శిరిభార్యామణియై, విరించి కొడుకై... అంటూ వీరి ఆశీర్వచనాలు ఇలా సాగుతాయి.

# దేవరపెట్టి

"దేవరపెట్టి" వారు అనగా కాళికాదేవి భక్తులు - ఉపాసకులు. వీరిని "దేవరులు" అంటారు. దేవరకులస్థులు చేతిలో కొరడాలు పట్టుకొని వంటినిండా పసుపు కుంకుమలతో బొట్లుపెట్టుకుని జుట్టు విరబోసుకొని, చేతులకు భూంభేతాల తీగలతో తయారుచేసిన కడియాలు ధరించి కాళ్లకు గజ్జెలు కట్టుకొని దేవరపెట్టి (అమ్మవారిగుడి)ని తలపై పెట్టుకొని అమ్మవారిని స్తుతిస్తూ "శరణే భ్రమరాంబా - గజ్జెకట్టవే మారెమ్మా - గాజులు వేయవే మా తల్లీ" అనే పాట పాడుతూ, డప్పు వాయిద్యాలు వాయిస్తూండగా - అమ్మవారి గుడిని వీధి మధ్యలో పెట్టి జనం గుమిగూడిన తరువాత పట్టపగలు కొరడాలతో వీపుపై కొట్టుకుంటూ, కొన్ని కనికట్టు విద్యలు ప్రదర్శిస్తూంటారు. అవి తాడుని రెండుముక్కలుగా చేసి మరలా అతికించడం, గుడ్డపరచి అందులో పేలాలు వేయించడం, నీళ్లలో పసుపు కుంకుమ కలిపి మళ్లీ ఆ పసుపుకుంకుమను పొడిగాపైకి తీయడం, బొమ్మని త్రాడుపై నడిపించడం - మూడు చెక్క గుళ్లను త్రాడుతో కట్టి ముడివిడిపోకుండగా ఆ మూడు గుళ్లనూ క్రింద పడవేయటం - వేపాకుతో, జర్రెలు, తేళ్లు చేయడం - అగ్ని స్థంభవ వగైరా కనికట్టు విద్యలను ప్రజలకు చూపిస్తూ, బహుమతులు తీసుకుని పొట్టపోసుకొనేవారే "దేవరపెట్టి" వారు.

వీరు ఎక్కువగా శ్రీశైలం ప్రాంతంలో ఉన్నారు. తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి జిల్లాలో కూడా ఉంటున్నారు. ఆ జిల్లాలలో ఈ కళకు ఆదరణ లభిస్తుంది.

శ్రీ సున్నవరపు వీరయ్య, శ్రీ విభూతి భవానీ లింగం. శ్రీ యడవల్లిరమణ దేవరపెట్టె కళారూపాల ప్రదర్శనలలో ప్రసిద్ధులు. వీరికి పూర్వము శ్రీ అయ్యపు వెంకట కృష్ణ గారు తమ రచనలు ద్వారా ఈ దేవరపెట్టె కళారూపాలను విస్తృత ప్రచారం చేశారు. ☼

# థింసా నృత్యం

కేవలం విశాఖపట్నం జిల్లాలో మాత్రమే కనిపించి, కనువిందు చేసే అత్యద్భుతమైన గిరిజన నృత్య కళ థింసా నృత్యం. విశాఖపట్నంలోని గిరిజన ప్రాంతాలలో 14 రకాలుగా ఈ నృత్యం విరజిల్లుతుంది. విశాఖపట్నంలోని రెండవ కాశ్మీర్‌గా మరియు మరో ఊటీగా పిలవబడుతున్న అరుకులో సందర్శకుల సందర్శనార్థమై ఈ నాట్యాన్ని ఆంధ్రప్రదేశ్ పర్యాటక శాఖ ప్రత్యేకంగా అమర్చింది. ఒకరి వెనుకాల ఒకరు చేతులు పట్టుకొని పాములా నడుస్తూ వివిధ రకాలైన అడుగులు వేస్తూ మొదటిగా ఉండే నర్తకీమణి చేత నెమలి పింఛము గాని లేదా రంగు రంగులు గల గుడ్డను గాని, పట్టుకొని నర్తించడం విశేషం. దీనికి సన్నాయి, తుడుం, డప్పు, తోములు లాంటి వాయిద్య పరికరాలతో వాయిద్య సహకారం అందిస్తారు. ఇందు మగవారు వాయిద్య సహకారం అందిస్తే స్త్రీలు నాట్యం చేస్తారు. ఒకప్పుడు మగవారు కూడా స్త్రీలతో పాటు నర్తించేవారు. కాలక్రమేణా మగవారు వాయిద్యకారులుగా స్త్రీలు నర్తకీమణులుగా మారిపోయారు. వీరి బృందంలోని స్వర్గీయ కిల్లో జానకమ్మ నృత్యాన్ని చూసిన మాజీ ప్రధాని కీ॥శే॥ ఇందిరాగాంధీ గారు ఈవిడను ఢిల్లీ రప్పించుకొని అక్కడి అధికారుల భార్యలతో తాను స్వయంగా కలసి ఈ నృత్యాన్ని నేర్చుకున్నారు. కిల్లో జానకమ్మ గారికి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భాషా సాంస్కృతిక శాఖ కళారత్న (హంసా అవార్డు)ను ఇచ్చి సత్కరించింది. నవ్యాంధ్రప్రదేశ్ ఉగాది ఉత్సవాల్లో ప్రభుత్వం తూళ్లురులో థింసా కళాకారిణి గాసమ్మకు కళారత్న (హంసా అవార్డు)ను ఇచ్చి సత్కరించింది. ఈ విధంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భాషా సాంస్కృతిక శాఖ థింసా నృత్యానికి ఓ ప్రత్యేకతను ఇచ్చి దాని వైభవాన్ని ఎల్లరకూ తెలియజేస్తుంది.



# జాతాపు (గొడుగు, గొలుసు)

ఈ నృత్యం విజయనగరం జిల్లాలోని జాతాపు గిరిజనులు మాత్రమే నర్తిస్తారు. కేవలం మగవారు మాత్రమే ఈ నృత్యంలో పాల్గొంటారు. వీరి మాటలకు గాని, పాటలకు గాని లిపి లేదు. మగవారిలో ఇద్దరు రెండున్నర నుండి మూడు అడుగులు గల పిల్లనగ్రోవిని వాయిస్తారు. మిగిలిన వారు కాళ్లకు కడియాలు పెట్టుకొని తెల్లపంచి ముడుకుల వరకు కట్టుకొని పైన జుబ్బా వేసుకొని ఒక చేతిలో గావంచా పట్టుకొని మరొక చేతితో రంగు రంగుల తాటాకు గొడుగులను పట్టుకొని వారి భాషలో పాటలు పాడుకుంటూ గుండ్రంగా, పాము ఆకారంలో తిరుగుతూ నర్తిస్తారు. వీరిలో ఎక్కువగా కల్యాణాలలో ఆడపిల్లను ఇంటినుండి తీసుకువచ్చినపుడు మొదటి రాత్రి శోభనం నాడు తిరిగి అత్తవారింటికి సాగనంపినపుడు శృంగారం బోధించడం వంటి పద్ధతుల్లో వీరి నృత్యాలు కొనసాగుతాయి. ☼

# మయూర నృత్యం

శ్రీకాకుళం, విశాఖ జిల్లాలోని గిరిజన ప్రాంతాల్లోని ఖోంచ్‌ల తెగవారుచేసే మయూరి నృత్యం కూడా ప్రసిద్ధి చెందిందే. వీరినే కోదోలని, సామంతులని కూడా అంటారు. వివాహసమయంలో వీరు ఈ నాట్యం చేస్తుంటారు. నాట్యం చేసే వారు తెల్లటి దోవతి కట్టుకుంటారు. తలపాగా చుడతారు. కాళ్లకు గజ్జెలు కడతారు.ఈ గజ్జెలనే 'ముయ్యంగము' అని తలపాగాను తోయంగము అని పిలుస్తారు. తుంగ గడ్డితో తయారుచేసిన ఈతలపాగాకు రంగు రంగుల గుడ్డపీలికలు కుచ్చులుగా కడతారు. నడమును వెనుక నెమలి ఫించం గుత్తిని కట్టుకుంటారు. నాట్యం చేసేవారు రెండు వరుసల్లో నిలబడతారు. నెమలి అరుపును పోలిన శబ్దం చేస్తూ నిలబడి నాట్యం చేస్తూ నెమలిలా మోకాలిపై ముందుకు వంగుతారు. భూదేవికి, సూర్య భగవానుకీ మ్రొక్కిన తరువాత వీరు నాట్యం చేస్తారు. ఘల్లు ఘల్లు మని గజ్జెల శబ్దాలలో నాట్యం రసవత్తరంగా సాగుతుంది. పిరోడి అనే వాద్యంతో గానం చేస్తారు. ☼



# సవర నృత్యం

వ్యవసాయ పనులు ప్రారంభించి, విత్తనాలు వేసేటప్పుడు సవరలు, వారి భాషలో పాటలు పాడుకుంటూ, నృత్యం చేస్తారు. ఆ నృత్యాన్ని సవర నృత్యం అంటారు. సవరలు గిరిజనులు వీరు శ్రీకాకుళం జిల్లాలలోని లోపల ఉన్న అడవులలో, జిల్లా సరిహద్దులో ఉన్న ఒరిస్సా రాష్ట్రంలోని కొన్ని జిల్లాలలో నివసిస్తూ ఉన్నారు. వీరు పోడు వ్యవసాయం చేస్తారు. అనగా కొండలు గుట్టలలో కొంత భూమికి హద్దులు పెట్టుకొని వ్యవసాయం చెయ్యటం పంటలు అయిన తర్వాత ఆ భూమిని వదలి మరల వేరే భూమిని సాగు చేసుకోవటం. ఈ పద్ధతి దరిదాపుగా అన్ని అటవిక తెగలలో ఉంది. వీరు కొండదేవత పండగ చేసుకొని వారి భాషలో పాడుకుంటూ నృత్యం చేస్తారు. ఈ పండుగను ఆగమ పండుగ అని అంటారు. సవర నృత్య బృందంలో 15 నుంచి 18 మంది ఉంటారు. వాద్యాల వివరాలు.

పింగళి కర్ర - 1, తడుము -1, కామాక్షి కిన్నెర - 1, డప్పు - 1, తాళం - 1, గరగర-1

ఎంత సైన్సు అభివృద్ధి చెందినా మానవుడు ప్రకృతిపై ఆధార పడాల్సిందే. ప్రకృతి కరుణిస్తేనే మానవుని మనుగడ, అందుకు ఉదాహరణ గత కొన్ని సంవత్సరాలుగా వర్షాలు సరిగా లేకపోవటం, పంటలు పండక కరువు కాటకాలు రైతులు ఆత్మహత్యలు చేసుకోవటం జరుగుచున్నదే. ప్రకృతి యొక్క శక్తిని గ్రహించిన మానవుడు ఆనాటి నుండి తాను నమ్మిన దైవాన్ని ప్రార్థించి వ్యవసాయ పనులు మొదలుపెట్టడం అనగా భూమిని దున్నటం, విత్తనాలు జల్లటం, వర్షాలు సకాలంలో రావాలని ప్రార్థన ద్వారా దైవ శక్తిని ప్రేరేపించడం చేయుచున్నాడు. ఆ ప్రేరణవల్ల వర్షాలు సరిగ్గాపడి పంటలు బాగా పండుతాయని నమ్మకం. ఆధునిక మానవుడు కూడా ఇంతకన్నా ప్రకృతి విషయంలో చేసేదేముంది. ఎంత సైన్సు అభివృద్ధి చెందినా అంతే.

సవర నృత్యాన్ని సమాచార శాఖ వారు ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాలకు కూడా ఉపయోగించుకొనుట జరుగుతోంది.

# కొమ్ము కోయ నృత్యము

అనాదిగా ఈ నృత్యం సాంప్రదాయబద్ధంగా గిరిజనులలో వస్తోంది. ఈ నృత్యాన్ని తొలకరి రాగానే చేసుకొనే భూమి పండగనాడు విత్తనాలు చల్లుకునేటప్పుడు చేస్తారు. పంటలే మనిషికి జీవనాధారం, పంటలు పండితేనే ఆహారధాన్యాలు లభించేది. ఇంట్లోకి సరిపడా ఆహారధాన్యాలు ఉంచుకుని, మిగిలిన ఆహారధాన్యాలు అమ్ముకొని కావలసిన వస్తువులు కొనుక్కొని గిరిజినులుగాని, గ్రామీణులుగానీ మనుగడ సాగిస్తూంటారు. ఆ పంటలు పండాలంటే వాతావరణం సరిగ్గా ఉండాలి. వర్షాలు సకాలంలో కురవాలి. ఇవన్నీ ప్రకృతి మీద ఆధారపడి ఉన్నాయి. ఇంత విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి చెందినా ఇప్పటికీ వర్షాలు లేక పంటలు పండక రైతులు ఏ విధంగా బాధపడుతున్నారో అందరికీ తెలిసిందే. అందుకని పంటలు సరిగ్గా పండాలని దైవాన్ని ప్రార్థిస్తూ వ్యవసాయం మొదలుపెట్టే గిరిజనులు చేసే నృత్యమే కొమ్ముకోయ. ఈ నృత్యం గిరిజనులలో అతి ప్రాచీనమైన నృత్యము. తరువాత థింసా మొదలైన నృత్యములు వచ్చినవి. పెళ్లిళ్లకు, పండుగలకు, కొలువులకు కూడా ఈ నృత్యాన్ని ప్రదర్శిస్తారు.



ఈ నృత్యానికి ఆహార్యం

ఆడవారికి మోకాళ్లపైకి ఉండే చీర, గొట్టాడు జాకెట్, కొప్పులు, వాటిపై పక్షి ఈకలు.

మగవారికి పరికిణీలు, కాళ్లకు కంజర్లు, తలమీద కొమ్ములపైన నెమలిపింఛాలు బట్టలు ఉంటాయి.

వాద్యాలు డోళ్లు, కొమ్ము బూర.

బృందంలో 25 మంది కళాకారులు. అందులో 12 మంది ఆడవాళ్లు. 13 మంది మగవాళ్లు ఉంటారు. 5 గురు కొమ్ము బూర వాయించేవారుంటారు. వీరు వారి తాతల దగ్గర నేర్చుకొని వంశపారం పర్యంగా తరతరాలుగా నృత్యంస్తూ ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాలను వీరు ప్రదర్శిస్తున్నారు. క్రొత్తవారు కూడా ఈ కళను అభ్యసిస్తున్నారు.

# తంబుర యక్షగానం

తంబుర కథ, బుర్రకథలకు అతి చేరువలో వుండే యక్షగానం. పాత్ర తనను తాను పరిచయం చేసుకుంటూ ప్రేక్షక ఆదరణ పొందిన కళారూపాలలో ఇది ఒకటి. ఇందు కథకుడు గాత్రంతో మరియు నృత్యంతో ఆపకుండా కథ చెబుతాడు. అందువలన బుర్రకథ కంటే కూడా ఈ కథ శ్రమతో కూడుకున్నది. కథకునికి, వంతకులకి పాటపై అవగాహన, పట్టు వుండాలి. ఆపకుండా కథ చెప్పగలగాలి. ఈ కళ శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో ఎక్కువగా ప్రాముఖ్యతలో వుంది. ఇందులో వల్లయ్యదాసు గారు మంచి నేర్పరి ఎంతోమంది శిష్యులను తయారుచేసి ఆనాటి రోజుల్లో ఈ యక్షగానానికి మంచి ప్రాచుర్యాన్ని తీసుకువచ్చారు.

వీరు కథలను పాట రూపంలో హావభావాలు ప్రదర్శిస్తూ, నృత్యం చేస్తూ అరణ్యకాండ, కిష్కింధకాండ, సుందరకాండ మొదలైన కథలు చెబుతూ ప్రేక్షకులను ఆకట్టుకుంటారు. బుర్రకథలో ఉన్నటువంటి హాస్యం ఇందులో వుండదు.

గౌరిపౌర్ణమి, పంటకోత కోసి కుప్పనూర్చినప్పడు వాటికి కాపలాగా వుండే రైతులు ఈ కళాకారులను పిలిపించుకొని ఆముదం దివిటీల వెలుగులో కథలు చెప్పించుకొని తెల్లవారులు మేల్కొని ఉండేవారు.



# జానపద గేయాలు

జానపదుల సుఖం నుంచి, దుంఖం నుంచి ఇతర భావోద్రేకాల నుంచి ఆశువుగా అలవోకగా పుట్టుకొచ్చిన ఈ జానపదగేయాలు ఏ ఒక్కరు సృష్టించినవి కావు. పాటలు, పదాలు, కీర్తనలు, తత్వాలు, దరువులు, జావళీలు, జోలపాటలు, లాలిపాటలు ఇంకా అనేకమయిన పాటలు, అనేక ప్రక్రియలు మన జానపద కళా స్రవంతిలో వెల్లివిరిసాయి.

జానపద వాఙ్మయం, జానపదకళలపై పరిశోధనల్లో తన జీవితాన్ని ధారపోసిన వారిలో శ్రీ నేదునూరి గంగాధరం గారు అగ్రగణ్యులు, వీరు వేమన పద్యాలు 5010 వరకూ సేకరించి ప్రచురించారు. జానపద



వ్యాసుడిగా పెద్దల ప్రశంసలు పొందారు. వీరిని ఆంధ్రవాఙ్మయ సరస్వతి అని ప్రస్తుతించేవారు. వీరు జానపద కవిత గురించి "మలమల మాడ్చే ఎండలు, హెూరున కురిసే వర్షాలు, ముడుచుకుపోయే చలి, ఆనందంలో ఉర్రూతలూగించే పంటపొలాలు, కష్టమైన పనులు, చావులు, పుట్టుకలు, పెళ్లిళ్లు, పెటాకులకు, పండుగలు, పబ్బాలు, పూజలు, పూనకాలకు ఒకటేమిటి ప్రతిసంఘటన, ప్రతి సన్నివేశము పల్లెటూరివారి కవితావేశానికి మూలకందాలవుతూ వచ్చాయి" అని అన్నారు.

జానపద సాహిత్యానికి లయ ప్రధానమయ్యింది దరువు ఆలంబన అయ్యింది. ఇక్కడ భావానికి ప్రాధాన్యతే ఉంది గాని భాషకు కాదు. వారికి తెలిసింది మాట్లాడుకునే భాష, ఆనంద విషాదానుభూతులతో వారిమాటలే పాటలయ్యాయి. ఆ పాటలే జనజీవితాన్ని కదిలించాయి.

మనిషి పుట్టుక దగ్గర్నుండి చావు వరకు మనిషి జీవితంలో సంభవించే అనేక అనుభూతులు జానపద సాహిత్యంలో చోటు చేసుకొన్నాయి. చంటి పిల్లల్ని నిద్ర పుచ్చటానికి జోలపాట.

# వీధి నాటకం

తెలుగునాట 13వ శతాబ్దం నాటికే బహురూప నాటకాలు అనే వీధి నాటక రీతులుండేవని తెలుస్తోంది. చతుష్పాదాలలో ప్రదర్శించడం వలన వీటికి వీధి నాటకాలన్న పేరు వచ్చింది. ఏ కావ్య సృష్టికైనా కాలం ప్రమాణం. మనుషుల తాత్విక చింతనకు ఒక సమిష్టి రూపమే కాలం. భిన్నవృత్తుల సంఘర్షణకు కళాత్మక రూపం నాటకం. సమకాలీన సమాజం ఎదుర్కొం టున్న సమస్యలను, సుఖదుఃఖాలను, జయాపజయాలను, కష్టాలను, కన్నీళ్లను ఆవిష్కరిస్తుంది నాటకం. వీధి నాటకాలు ప్రదర్శించేవారిని మేళాలు అని పిలిచేవారు. 19వ శతాబ్దంలో గట్టుదేశపు వారి మేళం, లేసాని వారి మేళం, తాడిపత్ర మేళం, వేములపల్లి మేళం, రామకృష్ణయ్య మేళం వంటి మేళ సమాజాలుండేవని తెలుస్తోంది. ఆధునిక ప్రక్రియలో తెరలు, రంగాలంకారణ లేకుండా నాటికలు, నాటకాలు వీధిలోకి వచ్చాయి. ఈ ప్రక్రియలో నటీనటులు అందరూ ప్రేక్షకుల మధ్యనుంచే వస్తారు. సందర్భాను సారంగా వీరే సెట్స్ ప్రోపర్టీస్



కూడా అవుతారు. ఈ వీధి నాటకాలలో ప్రస్తుత సమాజ పరిస్థితులు, ప్రజలను చైతన్యవంతులను చేసే ఇతివృత్తాలు ఎక్కువగా ఉంటాయి. వీటిని ప్రభుత్వం తరపున చేపట్టే అభివృద్ధి కార్యక్రమాల గూర్చి ప్రజలకు తెలియజేయుటకు ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. శాస్త్ర పరిశోధ నలు మానవ కళ్యాణం కోసమే గాని, మారణహోమం కోసం కాదు అన్న సత్యాన్ని తెలియజేసేందుకు ఆవిర్భవించినదే ఈ వీధి నాటకమని కొంతమంది పరిశోధకుల భావన. ఈ వీధి నాటకాల్లో నవరసాలు ఉంటాయి. ఇందులో హాస్యరసానికి కాస్త ప్రాముఖ్యతనిస్తూ కళాకారుల ప్రదర్శన కనువిందుగా కొనసాగుతుంది.

# అమ్మవారి కావిడి

కావడిలో ఒకవైపు అమ్మవారి విగ్రహం, ఒక పళ్లెంలో పూజాద్రవ్యాలు, పసుపు, కుంకుమలు ఉంచి వేరొకవైపు భిక్షం పెట్టించుకుంటూ, ఇంటి ఇంటికి తిరిగేదే అమ్మవారి కావిడి. వీరు ప్రతి ఇంటికి వెళ్లి ఇంటిముందు అమ్మవారు మీ ఇంటికి అనుగ్రహించటానికి వచ్చింది అంటూ ఆ పళ్లెంతో తిరుగుతారు. పెద్దగా ఇంటిలో అందరికి వినపడేటట్లుగా అరుస్తారు. వారి అరుపు విని ఇంటిలోని ఇల్లాలు ఒక పళ్లెంలో బియ్యం, కూరగాయలు వగైరా తీసికొనివచ్చి కావడిలో ఉన్న అమ్మవారికి దణ్ణంపెట్టుకుని అమ్మవారి ముందు పళ్లెంలో ఉన్న కుంకాన్ని భక్తి భావంతో తీసికొని బొట్టుపెట్టు కొంటారు.

ఈ కళారూపం జానపదులు మరియు గ్రామస్థులలో ఉన్న నమ్మకాన్ని ప్రస్ఫుటం చేస్తుంది. అమ్మవారిని ఎంతో దూరం నుండి తీసికొనివచ్చామని జానపదుల భావనకాగా, అమ్మవారు తమ ఇంటి ముందుకే వచ్చారనేది ఒకశుభశకునంగా భావించి ఇంట్లోవారు భక్తి భావనతో కావిడి దగ్గరకొచ్చి అమ్మవారికి నమస్కరించి కుంకుమ ధరిస్తారు. మరియు దానం చేయటమనే సత్కార్యాన్ని ఆచరిస్తారు. ఈ విధంగా గృహిణికి పుణ్యము మరియు జానపదునికి పారితోషికము లభిస్తాయని అంటారు.

ఈ కళారూపం ప్రజలలో భక్తిభావన పెంచుటకు దోహదపడు ననుటలో అతిశయోక్తి లేదు. ☼

# చెంచులు

చెంచులు గిరిజన తెగకు చెందినవారు. వీరు శ్రీశైలం అటవీ ప్రాంతాలలో నివశిస్తారు. వీరిని ఇప్పటివరకు ఆదిమ గిరిజన తెగగా ప్రభుత్వం గుర్తిస్తోంది. వీరు శ్రీశైలం ప్రాంతం నుండి ఉత్తరాంధ్ర జిల్లాలకు వలస వచ్చి 20, 30 సంవత్సరాలుగా జీవనం సాగిస్తున్నారు. శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట మండలం దేవాది, కొమర్తి పరిసర ప్రాంతాలలో ఉన్నారు. వీరు సంక్రాంతి ముందురోజులలో గ్రామాలలో పర్యటిస్తారు. శివరాత్రికి శ్రీశైలం స్తూ దానికి జవాబుగా ఎదుట వర్గం వారు ఏ వూరు అయితేమి! ఏ పల్లె అం ఌతేమి ఏటకొచ్చిన వాడపోరోరి, అడవి ఏటకొచ్చినా వాడ పోరోరి అని జవాబు చెబుతూ సంవాదం జరుగుతాది. తరువాత వెదురు ముళ్ళు లేదా ఇతర ముళ్లతో చేసిన కంపలపై పడుకొంటారు. అదే విధంగా ఇనుప మేకులు కొట్టిన పావుకోళ్లు కాళ్లకు వేసుకుని నడుస్తారు. ఇది దేవుడి మహిమగా చెబుతారు. వీరు బృందాలుగా గ్రామాలలో పర్యటిస్తారు. నెమలి ఈకల కిరీటాన్ని తలపై పెట్టుకుంటారు. నుదుట మూడు నామాలు వెనుకకు జుట్టుల నెమలి ఈకలు పెట్టుకొని రంగు రంగుల వస్త్రాలు ధరించి జేగంట వాయిస్తూ రెండు బృందాలుగా ఏర్పడి పాటలు పాడతారు. చెంచువాళ్లను చూసి ఉత్తరాంధ్రలోని గ్రామీణ కళాకారులు చెంచు భాగోతం పేరిట కొన్ని నాటకాలను కూడా రూపకల్పన చేసి కృష్ణుడు, చెంచుభామ, సంవాదం లాంటివి కల్పించి ప్రదర్శనలిచ్చిన రోజులున్నాయి.

# మరికొన్ని జానపద కళలు

## 1. మొండివారు

వీరినే కనకదుర్గమ్మ పాటవాళ్లని అంటారు. వీరు మాడుగుల మండలం ఎం. కోడూరులోను, శ్రీకాకుళం జిల్లా పాలకొండలో ఉన్నారు. వీరు సంచార జీవనం గడుపుతుంటారు. గ్రామాలలో పాటలు పాడుతుంటారు.

## 2. మౌలాలీ మీలాద్ మట్కాపార్టీ (అబాద్ మహొల్లా)

అబ్దుల్ రహీంఖాన్, మస్థాన్ వీధి, విజయనగరం, ఉర్దూలో పాటలు పాడుకొని కంజరి వంటి వాయిద్యాలతో ముస్లిం సోదరులు ఆలపించే భజన బృందం లాంటిదే మట్కా పార్టీ.

## 3. బిందుల నృత్యం (బిందెల డాన్స్)

బిందెలను తలపై పెట్టుకొని తుడుము, సన్నాయి, మేళం దరువులకు అనుగుణంగా డాన్స్ చేస్తారు. కొన్నిసార్లు మూడడుగుల కొయ్యలు కట్టుగొని గోపికలు, కృష్ణుడు ఆడుతుండగా చేతిలో చిడతలు పట్టుకొని, భుజాన కర్రలు పెట్టుకొని ఆడుతారు. దీనిని మరగాళ్ల బిందుల డాన్స్ అని అంటారు. రాజరాజేశ్వరి నాట్యమండలి, చిన్న-పారన్నవలస (సాలూరు) కళాకారులు ప్రసిద్ధులు. వీళ్ల గురువు పైడప్పడు. మరగాళ్ల బిందుల డాన్స్‌కు విజయనగరం జిల్లా బలిజపేట మండలం శ్రీదేవి నాట్య కళామండలి గంగాడ గ్రామం ప్రసిద్ధి. వీళ్ల గురువు పాందూరు తోడుగారు.

## 4. కాశీకావడి

కాషాయ వస్త్రాలు ధరించిన వ్యక్తి కాశీకావడి అంటూ ఒక కావడిని భుజాన వేసుకొని రెండుప్రక్కల పసుపు రంగు బట్టలతో మూటగట్టిన బిందెలు గాని, రెండు బుట్టలు గాని కావడికి కట్టి, కావడిలో కాశీవిశ్వనాథుని విగ్రహాలను వుంచి కుంకాలతోను, పువ్వులతోనూ అలంకరించుతారు ఈ కళారూపం అక్కడక్కడ కనిపిస్తుంది.

పూర్వకాలంలో ప్రయాణసాధనాలు లేనపుడు ఎన్ని శ్రమలు పడి కాశీ చేరేవారో అవన్ని కథలో వివరించేవారు. ప్రస్తుతం ఇది భుక్తి గురించి మాత్రమే జరుగుతుంది. ఎందుకంటె ప్రయాణ సాధనాలు పెరిగి సులభంగా కాశీ వెళ్ళి వస్తున్నారు.

## 5. మటియా సాయిల్

మటియావాళ్ళుగా చెప్పకొనే వీరు చెంచులని కూడా చెప్పకుంటు న్నారు. ఎర్రని బట్టలు ధరించి తలపాగాచుట్టుకొని ఒక కుండను భుజంపై పెట్టుకొని వస్తారు. ఆ కుండపై నృత్యాలు చేస్తున్నట్లు బొమ్మలుంటాయి. ఈ కుండపై బొమ్మలు పర్లాకిమిడిలో వేస్తారని చెప్పారు. వీధులలో కొన్ని సార్లు కాళ్ళకు గంటకట్టుకొని తిరుగుతారు. యాచన చేస్తారు. శ్రీకాకుళం జిల్లా నందిగాము మండలం కొండ పేటలో 10 కుటుంబాలు వారున్నారు. బండి నీలన్న (6) ఈ వృత్తిలో కొనసాగుతున్నారు.

## 6. మటియా చిక్కులు

మటియావాళ్ళు ఒక ఇనుపరాడ్డుకు గొలుసుతో కొన్ని చిక్కులు వేసేవారు దానిని ఎవరినైనా తీయమనేవారు. ఎవరు తీయలేకపోయే వారు. దీనినే మటియా చిక్కులు అని కూడా అంటారు. ఎవరైనా సమస్యలు సృష్టిస్తే వాటిని మటియాచిక్కులు అంటారు.

## 7. సిరిమామిడి సన్నాయి మేళం

సోంపేట మండలం సిరిమామిడి గ్రామంలో హరిజన కులానికి చెందిన వీరు సన్నాయి మేళం పెళ్ళిళ్ళుకు కొడతారు. వంశపారంపర్యంగా వస్తున్న వీరి విద్య ఎవరివద్ద శిక్షణ లేకుండానే అన్నమయ్య వంటి కీర్తనలకు మంచి సన్నాయి, దరువులు వేస్తారు. ఇలాంటి సన్నాయి మేళం మామిడిపల్లి మరియు ఉత్తరాంధ్రలో మరికన్ని చోట్ల గలదు.

## 8. ఉద్దానంలో సన్నాయి,తుడుం/రమడోలీలు (రణభేరీలు/టకోరిమేళం)

గిరిజనులు ఉపయోగించుకొనే సంప్రదాయ తుడుం, సన్నాయి వాయిద్యాలు శ్రీకాకుళం జిల్లా సోంపేట తాలూక ఉద్దానం ప్రాంతాలలో

నిన్న మొన్నటివరకు వెనుబడిన కులాలు అయిన పల్లి, వాడ బలిజ, గొల్ల కులాలకు పెండ్లిండ్లు, సంబరాలు, చాటింపులకు, గ్రామదేవత సంబరాలకు ప్రధాన వాయిద్యం, ఇటీవల అభివృద్ధి చెందినవారు బ్యాండుమేళం పెట్టుకుంటు న్నారు. కాని పేదవర్గాలకు ఇంకా ఇది ప్రధాన వాయిద్యమే. ఉద్దానంలో ఈ మేళం దరువులకు అడుగులు వేయకుండా ఎవరు ఉండరు. పాటలు పాడుకొని మరీ ఆడతారు. వాయించే ఈ వాయిద్యాలకు బారికోలమేళం అని కూడా అంటారు. ఇది ప్రాచీన కాలం నుండి ఉన్నట్లు తెలుస్తుంది. రంగోయి గ్రామం కొత్తపల్లి అప్పన్న (బారికి అప్పన్న), భీమారావు గంగువాడకు చెందిన గురుబెల్లి గోపాలం, మాకనపల్లి గ్రామాలలో కూడా ఈ మేళంలు గలవు.

దీనిని దొమ్మర మేళం అని అన్నప్పటికీ వీటికి కూడా స్వరాలు, తాళాలు, అడుగులు ఉన్నాయి. రమడోళీలు మందసలో రెల్లికులానికి చెందిన వారు వాయిస్తారు. వీటినే పెద్దభేరీలు అని కూడా అంటారు. టకోరిమేళం కూడా ప్రసిద్ధి చెందిన పల్లెకారుల వాయిద్యం. ఈ వాయిద్యాలన్నీ హరిజన (మాల) కులాలువారే వాయిస్తారు.

## 9. మరికొన్ని డాన్స్‌లు, వేషాలు

నాగినీ డాన్స్, కంజరిడాన్స్, పూసలడాన్స్, కొండవేషం, తాటకి వేషం, శెట్టివేషం, పళ్లవేషం ఇవన్నీ ఉత్తరాంధ్ర జానపదాలే.

## 10. కోయివేషం, భట్రాజులు

కోయివేషానికి సుమారు 12 మంది కళాకారులుండాలి. ఆడమగవేషాలతో వేసే కోయివేషానికి మద్దెల హార్మోనియం కొన్ని చోట్ల ఉపయోగిస్తారు. మరికొన్ని చోట్ల డప్పుల సహాయంతో వేస్తారు. కోయివేషానికి విజయనగరం అయ్యన్నపేట, కొత్తపేట కళాకారులు ప్రసిద్ధి భట్రాజులు పొగడ్తలు పొగుడుకుంటూ జ్యోతిష్యం చూస్తామని వస్తూ ఉంటారు. కోయివేషంలో అయ్యన్నపేటకు చెందిన త్రినాధరావు బృందం, కొత్తపేటకు చెందిన పైడిరాజు ప్రసిద్ధి.

## 11. చిలక జోష్యం

చిలకా... జోష్యం.. ప్రశ్న అంటూ శ్రీశైలం నుంచి వస్తున్నాము. చిలక జోష్యం చెబుతామని ఊరూరా తిరుగుతారు. కొన్ని దేవుని ఫోటోలను ఉంచి వాటి నుంచి ఒక దానిని ఎంచమని చిలకను పిలుస్తారు. చిలక ఒక కార్డును తీసి ప్రక్కన పెడుతుంది. దానిని బట్టి జోష్యం చెబుతారు. వీరి జాతకాలు వీరికి తెలియకపోయినా ప్రక్కవారి జాతకములు చెబుతూ పొట్టపోషించుకుంటున్నారు.

## 12. నెత్తికోతలవారు

వీరు కోమటిల ఇండ్ల వద్దకు వచ్చి కత్తితో కోసుకుంటారు. ఒళ్ళంతా కత్తులతో గాట్లు పెట్టుకుంటారు. డబ్బులు ఇచ్చాక ఇంటి నుండి కదులుతారు.

## 13. తత్వాలు

బైరాగులు, సన్యాసులు గ్రామాలలో భిక్షం ఎత్తుకొని కాషాయి వస్త్రాలు ధరించి తత్వాలు పాడుకుంటూ వీధుల్లోకి వస్తారు.

## 14. శులాల పండగ

విశాఖ జిల్లా మునగపాక మండలంలో ఈ శులాల పండగ జరుగుతుంది. శరీరమంతా శులాలు పొడుచుకొని డప్పులు, వాయిద్యాలకు అనుగుణంగా నృత్యం చేస్తారు. విజయనగరంలో దుర్గాలమ్మ శులాల పండుగ జరుగుతుంది. వీరు అగ్నిగుండాలు త్రొక్కుతారు.

## 15. గరిడీ

ఈ కళకారులు మోకాళ్ళ నుంచి పాదాల వరకు గుడ్డలు చుట్టుకొని రంగుల చెడ్డీలు వేసుకుంటారు. చెడ్డీలకు పెద్ద పెద్ద మువ్వలు ఉంటాయి. రణభేరి లేదా రామడోలి శబ్దాలకు అనుగుణంగా నాట్యం చేస్తారు.

## 16. గారడీ విద్యలు

దీనిని ఇంద్రజాలమని, ఈ విద్య ప్రదర్శించేవాళ్లని ఇంద్రజాలికులని వ్యవహరిస్తారు. ఈ విద్యలు పూర్వకాలము నుండి ఉన్నాయి. ఇప్పటికే ఈ గ్రామాల్లో కొంతమంది అరచేతిలో రూపాయి సృష్టించడం, ఒకరి జేబులో వస్తువులు మరోకరి జేబులోకి మార్చడం వారి చేతిలో ఉన్న కొబ్బరికాయ తాడుతో కట్టబడి వీరు పిలిచిన వెంటనే ఎటు కావలంటే అటు వెళ్లడం చేస్తుంటారు. దీని నుండే ఆధునిక ఇంద్రజాల విద్యలు వచ్చాయి.

## 17. తుమ్మెద పాట

ఆడవాళ్లు వుడుపులు, కోతల కాలంలో రావే రావే నల్ల తుమ్మెద.. అంటూ పాటలు పాడుకుంటూ ఉంటారు.

## 18. అంజాట

చుట్టు వృత్తాకారంగా నిలబడి మధ్య తుడుం, సన్నాయి వగైరా వాయిద్యాలకనుగుణంగా పాటలు పాడుతూ నృత్యం చేస్తారు.

## 19, తంబురపాటలు

బుడిగె జంగాలకు చెందిన స్త్రీలు తంబుర సహాయంతో పాడే పాటలు. వీరు బాలనాగమ్మ, సన్యాసమ్మ కథ మొదలగునవి చెబుతారు.

## 20. జాలారి భాగోతం

జాలారి భాగోతం ఈశ్వరుడు జాలరి కన్నను పెళ్లిఆడటం లాంటి విషయాలను ప్రదర్శిస్తారు. విజయనగరం జిల్లా భోగాపురం దగ్గర పూసపాటిరేగ మండలంలో ఈ కళారూపాలు ఉండేవి.

## 21. దాటు భజన

హరిలో రంగ హరి అంటూ పెద్ద పెద్ద చెక్కలతో చేసే భజన దాటు భజన. ఇది అక్కడక్కడా కనిపిస్తుంది. ఇందులో సాహిత్యం వినసొంపుగా ఉంటుంది.

## 22. మైలర్లు

సంవత్సరానికి ఒకసారి ఒక కావడిలో కన్యకాపరమేశ్వరి ఫోటోను గాని, విగ్రహాన్ని గాని పట్టుకొని వైశ్యుల ఇళ్లకు వస్తారు. వీరికి ఆనవాయితీగా ఒక పూట భోజనం, కొంత డబ్బులు, పసుపు, కుంకుమ, జాకెట్ ముక్కలు, అమ్మవారికి సమర్పించి కన్యకాపరమేశ్వరి యొక్క వృత్తాంతాన్ని తెలుసుకుంటారు.

## 23. తాట్రాజువేషం

గిరిజనుల గూడెం నాయకుడు తాట్రాజు. గిరిజనులపై జరిగే అమానుష చర్యలకు తిరగబడేవాడు. బహుమేధావి, బలశీలి, వీరి వేషాన్ని కొంతమంది నేర్చుకొని గాలిలో ఎగురుతూ ఎడ్లబండిపైకి వెళ్లడంలాంటి సాహసకృత్యాలు చేస్తారు.

## 24. కంజిరి పాట

పాటలోని విశిష్టతను కంజర సహాయంతో తెలియజెప్పతూనే రాగయుక్తంగా పాటను అందిస్తూ ప్రస్తుత సమకాలీన పరిస్థితులను తెలియజెప్పే ఓ ప్రక్రియ ఈ కంజిరి కథ. కాలాక్రమేణా రూపాంతరం చెంది నేడు గజిల్స్ అనే పేరిట వెలుగొందుతుంది.

## 25. బయోస్కోప్ పెట్టె

బయోస్కోప్ పిల్లోంచింది... భలే తమాషా చూపిస్తోంది అంటూ ఒక పెట్టెను తెచ్చి... పాట పాడుతూ పాటకుతగ్గట్టుగా కాశీ, కలకత్తా లాంటి ప్రదేశాలను ఈ పెట్టెలో కనిపించేటట్టు చేసేదే బయోస్కోప్ పెట్టె.

## 26. మల్లిఖార్జునవారు

వీరు కర్రలకు ఆముదపు గుడ్డలను చుట్టి డోలు వాయించు కుంటూ ఈ దివిటీలతో విన్యాసాలు చేస్తారు. బంతులు గాలిలో ఎగురవేసి విన్యాసాలు చేస్తారు. ☼

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
### భాషా సాంస్కృతిక శాఖ

- గోదావరి మహా పుష్కరాలు 10,000 మంది కళాకారులతో ప్రదర్శనలు, 98 నాటకాలు, 1,000 మంది కళాకారులతో భారీ ఊరేగింపు.
- 1,000 మంది కూచిపూడి నృత్య కళాకారులతో మహా బృంద ప్రదర్శన.
- విశాఖపట్టణం, విజయవాడ మరియు తిరుపతి నగరాలలో ప్రతి ఆదివారం సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ.

ప్రణాళికేతర పథకాలు :

- ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాలలు / కళాశాలల నిర్వహణ
- అమరజీవి పొట్టి శ్రీరాములు మెమోరియల్ సొసైటి, చెన్నై గ్రాంటు
- జిల్లా సాంస్కృతిక మండళ్ళకు గ్రాంటు
- ప్రముఖ జాతీయ నాయకుల విగ్రహాల ఏర్పాటు
- 6,746 వృద్ధ కళాకారులకు నెలకు రూ.1,500/- లు చొప్పున ఫించన్లు
- కళాకారులకు రైల్వే కన్సెషన్ మంజూరు చేయుట

ప్రణాళికా పథకాలు :

- సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ, సంక్రాంతి సంబరాలు, ఉగాది వేడుకలు
- ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాలలు / కళాశాలలలో కార్యక్రమాల నిర్వహణ
- ఆడిటోరియంల నిర్మాణం
- ఘంటసాల మ్యూజియం నిర్మాణం
- కూచిపూడి నాట్యారామం
- కళాకారులకు గుర్తింపు కార్డులు జారీ
- సాంస్కృతిక సంస్థలకు ఆర్థిక సహాయం
- ప్రముఖ వ్యక్తుల జయంతి ఉత్సవాలు
- షెడ్యూలు కులాల ఉపప్రణాళిక కార్యక్రమాలు
- షెడ్యూలు తెగల ఉపప్రణాళిక కార్యక్రమాలు

సంచాలకులు

ఆం. ప్ర. భాషా సాంస్కృతిక శాఖ